Quran ke Chaar Buniyadi Isthelahe
(Telugu)

# దివ్యఖుర్ఆన్‌లోని
# పారిభాషికాలు

మూలం
మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ (రహ్మాలై)

అనువాదం
షేఖ్ అబ్దుల్ బాసిత్

# విషయ సూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# పీఠిక

ఖుర్‌ఆన్ పరిభాషలో విస్తృత అర్థాలుగల ఇలాహ్ (దేవుడు), రబ్ (ప్రభువు), ఇబాదత్ (ఆరాధన) మరియు దీన్ (ధర్మం) అనే నాలుగు పదాలు అత్యంత ప్రాధాన్యతను సంతరించుకున్న మౌలిక అంశాలు. బ్రహ్మాండమైన ఈ సృష్టికి కర్త అయిన ప్రభువు మరియు దేవుడు ఒక్కడే. ఆయన తప్ప మరో దేవుడుగాని, ప్రభువుగాని లేనేలేడు. ఆయన దైవత్వంలో, పోషకత్వంలో ఆయనకు సహవర్తులెవరూ లేరు. కనుక ఆయననే మీ దేవునిగా, ప్రభువుగా అంగీకరించాలి. ఆయనను తప్ప మరెవరినీ దేవునిగా లేదా ప్రభువుగా భావించరాదు. ఆయన కొరకే ధర్మాన్ని (జీవిత విధానాన్ని) పూర్తిగా ప్రత్యేకించుకోవాలి. సత్యధర్మమైన ఇస్లాం విధానాన్ని (ధర్మాన్ని) తప్ప మరే ఇతర ధర్మాన్ని అనుసరించరాదు అన్నదే ఖుర్‌ఆన్ పూర్తి సందేశం.

> "మేము నీకు పూర్వం ఏ ప్రవక్తను పంపినా, అతనికి వహీ ద్వారా "నేను తప్ప మరో దేవుడు లేడు. కనుక మీరు నాకే దాస్యం చేయండి" అనే విషయాన్ని తెలియజేశాము." *(అంబియా : 25)*

> "వాస్తవానికి ఒకే దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు. ఆయన తప్ప ఆరాధనకు అర్హుడైన వాడెవ్వడూ లేడు. వారు దైవానికి కల్పించే భాగస్వామ్యాల నుండి (షిర్క్ నుండి) ఆయన పరిశుద్ధుడు". *(తౌబా : 31)*

> "మీ ఈ సంఘం (ప్రవక్తలందరి సంఘం) వాస్తవానికి ఒకే ఒక

సంఘం. నేను మీ ప్రభువును కనుక మీరు నన్ను ఆరాధించండి."
(అంబియా : 92)

ఇలా అను: "నేను అల్లాహ్‌ను కాదని వేరే ప్రభువును అన్వేషించాలా, ఆయనే ప్రతి దానికి ప్రభువైనప్పుడు". (అన్‌ఆమ్ : 164)

"కనుక తన ప్రభువును కలుసుకోవాలని కోరుకునే వాడు మంచి పనులు చేయాలి. ఆరాధనలో తన ప్రభువుతోపాటు మరెవ్వరినీ భాగస్వామిగా చేయరాదు." .(అల్ కహఫ్-110)

"మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించండి, మిథ్యాదైవాల ఆరాధనకు దూరంగా ఉండండి" అని హెచ్చరించాము. (నహల్ : 36)

"ఈ ప్రజలు అల్లాహ్ ధర్మాన్ని వదలి, మరొక ధర్మాన్ని (విధానాన్ని) దేన్నయినా కోరుతున్నారా ఏమిటి? వాస్తవంగా భూమ్యాకాశాలలో ఉన్న సకల వస్తువులూ ఇష్టం ఉన్నా లేకున్నా అల్లాహ్ విధేయతకు కట్టుబడి వున్నాయి. అంతా ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.
(ఆలి ఇమ్రాన్ : 83)

ఓ ప్రవక్తా(స)! వారికి ఇలా చెప్పు : "ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించి, ఆయనకు మాత్రమే దాస్యం చేయి" అని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది.
(జుమర్ : 11)

"అల్లాహ్ నాకూ ప్రభువే మీకూ ప్రభువే కనుక మీరు ఆయన దాస్యమే చెయ్యండి. ఇదే ఋజుమార్గం". (ఆలి ఇమ్రాన్ : 51)

ఇలా ప్రత్యేకంగా కొన్ని ఖుర్‌ఆన్ ఆయతులను (వాక్యాలను) ఉదాహరణగా పేర్కొనడం జరిగింది. లేకపోతే మొదటిసారి ఎవరైనా ఖుర్‌ఆన్

అధ్యయనం చేస్తూ, ఖుర్ఆన్ సందేశమంతా పై నాలుగు అంశాల చుట్టే తిరుగుతున్నట్టు భావించేందుకు అవకాశమున్నది. ఈ గ్రంథం కేంద్రకాంశం ఏమిటంటే;

- అల్లాహ్‌యే ప్రభువు మరియు దేవుడు.
- దైవత్వం మరియు సార్వభౌమత్వం ఆయనకు తప్ప మరెవరికీ వర్తించదు.
- కాబట్టి దాస్యం ఆయనకే చేయాలి.
- ధర్మాన్ని అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోవాలి.

## ఈ నాలుగు పారిభాషికాల ప్రాధాన్యత

వాస్తవమేమంటే ఖుర్ఆన్ బోధనలను అర్థం చేసుకోవడానికి, ఇలాహ్ (దేవుడు), రబ్ (ప్రభువు), ఇబాదత్ (ఆరాధన) మరియు దీన్ (ధర్మం లేదా జీవన విధానం) – ఈ నాలుగు అంశాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఒకవేళ ఎవరైనా దేవుడు మరియు ప్రభువు అర్థమేమిటి? ఆరాధన అంటే ఏమిటి? ధర్మమని దేనిని అంటారు? అనే విషయాల సారాంశాన్ని పూర్తిగా తెలుసుకోకపోతే, వారు ఖుర్ఆన్ ద్వారా ఆశించిన ప్రయోజనాన్ని పొందలేరు. వారు తౌహీద్ (ఏకేశ్వరవాదం) అంటే ఏమిటో తెలుసుకోలేరు. దాస్యాన్ని కేవలం అల్లాహ్ కొరకే ప్రత్యేకించలేరు. అలాగే ధర్మాన్ని కూడా కేవలం అల్లాహ్ కొరకు మాత్రమే ప్రత్యేకించుకోలేరు. ఈ విధంగా ఎవరి మనోమస్తిష్కాలలోనయినా ఈ నాలుగు ప్రధానాంశాల పరమార్థం అస్పష్టంగా, అసంపూర్ణంగా ఉంటే ఖుర్ఆన్ ప్రబోధనలు వారికి అస్సలు మింగుడు పడవు. ఇలాంటి వారు ఖుర్ఆన్‌ను విశ్వసిస్తున్నప్పటికీ వారి నమ్మకం మరియు వారి ఆచరణ రెండూ కూడా అసంబద్ధంగా, అసంపూర్ణం గానే మిగిలిపోతాయి. వారు **"లా ఇలాహ ఇల్లల్లాహ్"** (అల్లాహ్ తప్ప మరో దేవుడు లేడు) అంటూనే అనేక ఇతర దేవుళ్ళను కూడా ఆరాధ్యులుగా చేసుకుని

వుంటారు. 'అల్లాహ్ తప్ప మరొక ప్రభువు, పోషకుడు లేడు' అని ఎలుగెత్తి చాటుతూనే ఉంటారు. అయినా అల్లాహ్‌గాకుండా అనేకమంది ప్రభువులు వారి మనస్సుల్లో తిష్ఠవేసుకుని ఉంటారు. "నేను అల్లాహ్ మార్గాన్నే అనగా ధర్మాన్నే అనుసరిస్తున్నాను" అని నిజాయితీగా అంటాడు. ఒకవేళ ఎవరైనా తనను ఇతర ధర్మాల వైపు (విధానాల వైపు) ఆపాదిస్తే కోపోద్రిక్తుడవుతాడు. అయినప్పటికీ తనకు తెలియకుండానే అనేక ఇతర ధర్మాల గుదిబండ అతని మెడకు వ్రేలాడుతూ ఉంటుంది. అలాగే తన నోటితో ఎన్నడూ ఇతరులను 'దేవుడు' అనిగాని లేదా 'ప్రభువు' అనిగాని పిలువడు కానీ, ఏ అర్థం, ఏ భావనలు ఈ పదాలలో ఇమిడి వున్నాయో, ఆ భావనలతో అనేకులను తన దేవుళ్ళుగా మరియు ప్రభువులుగా కలిగి ఉంటాడు. పాపం, తనకు తెలియకుండానే అనేకులను దేవుళ్ళుగా, ఆరాధ్యులుగా చేసుకుని ఉంటాడు. ఒకవేళ ఎవరైనా "నీవు దైవేతరుల దాస్యం చేస్తున్నావు, లేదా నీవు అనుసరిస్తున్న మార్గాలలో (ధర్మంలో) షిర్క్ భావాలు (ఇతర ధర్మపోకడలు) గోచరిస్తున్నాయి" అని అంటే చాలు, అతడు వెంటనే మీపై పోట్లాటకు దిగుతాడు. కాని ఆరాధన, ధర్మం అసలు వాస్తవికత ఏదైతే ఉందో, దానికి భిన్నంగా అతడు ఇతరులను ఆరాధిస్తూ ఉంటాడు. తాను నిజదైవాన్ని వదలి ఇతరులను ఆరాధిస్తున్నాను అనిగాని, తాను అనుసరించే ధర్మం నిజమైన ధర్మం కాదని, నిజానికది దైవేతరుల ధర్మం అనీ తెలుసుకోడు.

## తప్పుడు భావనలకు మూలకారణం

మొట్టమొదట అరబ్బుల ముందు ఖుర్‌ఆన్ సందేశాన్ని వినిపించినప్పుడు వారిలో ప్రతి ఒక్కరికి ఇలాహ్ (దేవుడు)– రబ్ (ప్రభువు) అని ఎవరిని అంటారో, దాని అసలు భావమేమిటో వారికి ముందే తెలుసు. ఎందుకంటే ఇవి అనునిత్యం వారి వాడుక భాష అరబీలో వాడే పదాలే కనుక. ఇంకా వారికి ఈ పదాల మూల భావాలేమిటో కూడా బాగానే తెలుసు. అందుకే వారి

ముందు అల్లాహ్‌ను మాత్రమే ఆరాధ్యుడిగా చేసుకోండి, ఆయన దైవత్వంలో, పోషకత్వంలో ఎవరికీ ఎలాంటి భాగస్వామ్యం లేదు అని చెప్పినప్పుడు, ఆ మాటలలో అంతర్లీనమైవున్న భావం ఏమిటో వారికి పూర్తిగా అర్థమైపోయింది. తద్వారా ఏవేవి ఖండించబడుతున్నాయో, ఏ విషయాన్ని అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోవాలో కూడా వారికి అర్థమైపోయింది. అలాగే దీన్ని వ్యతిరేకించిన వారు కూడా దైవేతరుల దైవత్వాన్ని, పోషకత్వాన్ని త్రోసిపుచ్చుటం వల్ల తమ స్వప్రయోజనాలకు కలిగే విఘాతమేమిటో, దాని పర్యవసానం ఏమిటో కూడా బాగా తెలిసే వ్యతిరేకించారు. ఇంకా ఎవరైతే విశ్వసించారో వారు కూడా తమ ఈ విశ్వాస ప్రకటన వల్ల తాము దేనిని వదులుకోవాలో, ఇంకా దేనిని అవలంబించాలో కూడా బాగా తెలుసుకొనే విశ్వసించారు.

అలాగే ఇబాదత్ (ఆరాధన), దీన్ (ధర్మం) అనే పదాలు కూడా ముందు నుండే వాడుకలో ఉన్నాయి. దాసుడని ఎవరిని అంటారు. దాస్యత్వపు భావన అంటే ఏమిటి? అనే విషయాలు కూడా వారికి ముందు నుండే బాగా తెలుసు. అలాగే ఆరాధనలో ఇమిడి వున్న భావం ఏమిటి? ధర్మం అంటే అర్థమేమిటి? అనేది కూడా వారికి బాగా తెలిసిన విషయాలే. ఇతరుల దాస్యాలన్నీ వదలుకుని కేవలం అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చేయండి. ఇతర ధర్మాలన్నింటితో తెగత్రెంపులు చేసుకుని అల్లాహ్ ధర్మంలోనే పూర్తిగా ప్రవేశించండి" అని ఖుర్‌ఆన్ పిలుపునిచ్చినప్పుడు వారికి ఖుర్‌ఆన్ సందేశాన్ని అర్థం చేసుకోవడంలో ఎలాంటి సంశయం, సంకోచం కలుగలేదు. వారు ఈ సందేశాన్ని విన్నంతనే, ఈ బోధనలు తమ జీవన వ్యవస్థలో ఎలాంటి మార్పును ఆశిస్తాయో కూడా వారికి పూర్తిగా అర్థమైపోయింది.

ఖుర్‌ఆన్ అవతరణా కాలంలో ఈ పదాలకున్న సిసలైన అర్థం, భావం కాలంతో పాటు మెల్లిమెల్లిగా మార్పులకు గురి అవుతూ వచ్చి, చివరికి అవన్నీ ఒక్కొక్కటిగా తమ విస్తృత భావపరిధి నుండి ప్రక్కకు జరిగి ఏదో ఒక పరిమిత

మైన, అస్పష్టమైన భావానికి మాత్రమే పరిమితమైపోయాయి. అంతేకాదు, చివరికి కొన్ని ఆచార వ్యవహారాల వరకే వీటిని పరిమితం చేసుకున్నారు. దీనికి మూలకారణాలు, అరబీ సాహిత్యంపై తగినంత అభిరుచి, శ్రద్ధ లేకపోవడం ఒక కారణమైతే, రెండవ కారణం, ముస్లిం జగత్తులో క్రొత్తగా వచ్చి చేరుతున్న వారికోసం **దేవుడు, ప్రభువు, ధర్మం, ఆరాధన** అనే పదాల అసలు అర్థమే కాలేదు. ఖుర్ఆన్ అవతరణా కాలంలో ముస్లిమేతర సమాజం కలిగి ఉన్న భావన వేరు. అంటే ఆనాటి అసలుసిసలు భావార్థం కాలప్రవాహంలో కొట్టుకు పోయింది. పై రెండు కారణాల వల్ల తదుపరి కాలంలో వచ్చిన ఖుర్ఆన్ అనువాదాలు, పుస్తకాలు, నిఘంటువులు, వ్యాఖ్యానాలు– అన్నీ వాటి పూర్వపు ధాతువు అర్థంలో, ఖుర్ఆన్ భావాలకు అనుగుణంగా కాకుండా ఆయా కాలాల్లోని ముస్లింలు అర్థం చేసుకున్న భావాలకు అనుగుణంగా చేయడం జరిగింది. ఉదాహరణకు : 'దేవుడు' అనే పదాన్ని విగ్రహాలు, దేవతలకు సమీప అర్థం, భావంలో వాడటం జరిగింది. అలాగే ప్రభువు అంటే పోషించేవాడు లేదా సకల లోకాలకు దేవుడు అన్న భావాలకే పరిమితం చేసివేశారు. అలాగే ఆరాధన అంటే పూజా, పునస్కారాలనీ, ధర్మం అంటే సాంప్రదాయం, మతము (Religion) అనే భావానికే పరిమితం చేసివేశారు. తాగూత్ అంటే విగ్రహం, షైతాను అనే అర్థాలలో వాడటం జరిగేది. ఫలితంగా ప్రజలకు ఖుర్ఆన్ అసలు ఉద్దేశ్యం అర్థం చేసుకోవడం కష్టమైపోయింది. "మీరు అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధ్య దైవంగా భావించరాదు" అని ఖుర్ఆన్ చెబుతుంటే, "మేము విగ్రహాలను, దేవతలను వదలివేశాము కదా, కనుక మేము ఖుర్ఆన్ ఉద్దేశ్యాన్ని నెరవేర్చినట్టేనని ప్రజలు భావించారు. కాని వాస్తవానికి 'ఇలాహ్' (దేవుడు) అనే పదం ఏ ఏ భావాలలో వాడబడుతుందో, ఆయా భావాలలో వారు ఇతరు లను ఆరాధ్యులుగా అంటిపెట్టుకొనే ఉన్నారు. చివరికి దైవేతరులను తమ ఆరాధ్యులుగా చేసుకున్నామన్న ధ్యాస కూడా వారికి లేకుండాపోయింది. అల్లాహ్‌ను తప్ప మరెవరినీ మీ ప్రభువుగా శిరసావహించరాదని ఖుర్ఆన్

బోధిస్తుంటే, 'నిస్సందేహంగా మేము అల్లాహ్‌ను తప్ప మరెవరినీ మా ప్రభువుగా అంగీకరించటం లేదు కనుక మేము ఏకేశ్వరవాదులమే" అని ప్రజలు భావిస్తు న్నారు. కాని 'ప్రభువు' అనే పదానికి ఏ అర్థాలు, భావాలైతే వస్తాయో, ఆ భావాలలో వారు ఎందరో దైవేతరులను నిజప్రభువుకు సాటిగా నిలబెట్టుకొని వున్నారు. "తాగూత్ దాస్యాన్ని వదలి అల్లాహ్‌నే ఆరాధించండి" అని ఖుర్‌ఆన్ బోధిస్తుంటే, "మేము విగ్రహాలను పూజించటం లేదు కదా!"అని ప్రజలు అంటు న్నారు. ఇంకా మేము షైతాన్‌ను శపిస్తున్నాము, అల్లాహ్‌కే సాష్టాంగ పడుతున్నాము కనుక ఖుర్‌ఆన్ చేసే ఈ బోధనను కూడా మేము ఆచరణలో పెట్టినట్టేనని ప్రజలంటున్నారు. కాని వాస్తవానికి వారు రాతి విగ్రహాలనయితే వదలి వేశారు కాని ఇతర **తాగూత్**లను (దైవధిక్కార కార్యాలను) మాత్రం అలాగే అంటిపెట్టుకుని ఉన్నారు. ఒక్క ఆరాధ్యాన్ని (పూజను) తప్ప ఇతర అన్నిరకాల ఆరాధనలను (విధానాలను) అల్లాహ్‌కు తప్ప ఇతరులకై ప్రత్యేకించు కున్నారు. ఇదే పరిస్థితి ధర్మాని(దీన్)ది కూడా. ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకించుకొనడమంటే ఇస్లాం మతాన్ని స్వీకరించి హిందువుగా, క్రైస్తవునిగా లేదా యూదునిగా ఉండకపోవడమేనని భావిస్తున్నారు. ఈ విధంగా ఇస్లాం మతాన్ని అవలంబించిన ప్రతి ఒక్కరు "నేను నా ధర్మాన్ని కేవలం అల్లాహ్ కొరకే ప్రత్యేకించుకున్నాను" అని భావిస్తున్నారు. కాని వాస్తవానికి ధర్మానికి ఉన్న విస్తృత భావం దృష్ట్యా చాలా మంది తమ ధర్మాన్ని నిజ దైవానికి ప్రత్యేకం చేసుకోలేదు.

## తప్పుడు భావనల పర్యవసానం

కేవలం ఈ నాలుగు పారిభాషికాల నిజభావనపై ముసుగు పడిపోవడం వల్ల మూడొంతుల ఖుర్‌ఆన్ సందేశం, దాని అసలు పరమార్థం మన దృష్టి నుండి కనుమరుగైంది. అందుకే ఇస్లాం స్వీకరించినప్పటికీ ప్రజల విశ్వాసం, ఆచరణలలో చాలా లోపాలు కానవస్తున్నాయి. అందుకే ఖుర్‌ఆన్ వాస్తవ

సందేశాన్ని, దాని వాస్తవ రూపంలో వివరించవలసిన అవసరం ఉంది. కనుక పై నాలుగు పారిభాషికాల పూర్తి సారాంశాన్ని విశ్లేషించవలసిన అవసరం తప్పనిసరి అయింది.

నేను ఇంతకు ముందు నా రచనలలో, వ్యాసాలలో ఈ అంశాలపై దృష్టి సారించిన మాట వాస్తవమే అయినప్పటికీ, ఇప్పటిదాకా నేను ఇచ్చిన వివరణ ఈ అంశాలపై ఉన్న అపోహలను తొలగించడంలో అందరినీ సంతృప్తపరచలేక పోయిందేమో అని నేను భావిస్తున్నాను. ఎందుకంటే, నిఘంటువు అర్థాలతో ఖుర్‌ఆన్ వాక్యాల అనుసంధానం చేస్తూ వివరించకపోతే ప్రజలు నా ప్రతి వివరణను నా అభిప్రాయంగా భావించవచ్చు. నా అభిప్రాయం నాతో ఏకీభవించని వారికి సంతృప్తిని ఇవ్వలేకపోవచ్చు. ఈ రచనలో నేను పై నాలుగు అంశాల పూర్తి సారాన్ని వివరించడానికి కృషి చేస్తాను. ఇంకా ఇందులో నిఘంటువు ద్వారాగాని ఖుర్‌ఆన్ ద్వారాగానీ రూఢీ కాని విషయాల జోలికి పోకుండా జాగ్రత్త వహిస్తాను.

వరుసక్రమం ప్రకారం ముందుగా ఇలాహ్ (దేవుడు) అనే పదాన్ని, ఆ తరువాత వరుసగా రబ్ (ప్రభువు), ఇబాదత్ (ఆరాధన), దీన్ (ధర్మం) అనే పదాల సారాంశాన్ని తీసుకుందాం.



# ఇలాహ్ (దేవుడు)

## నిఘంటు అర్థ పరిశోధన :

అలీఫ్, లామ్, హ అనే అక్షరాల కలయికతో ఈ పదము ఏర్పడింది. ఈ విధంగా ఏర్పడిన పదము యొక్క నిఘంటువు అర్థ వివరణ ఈ క్రింది విధంగా ఉంది.

- చలించిపోవటం, అదిరిపోవటం, ఆశ్చర్యచకితులవటం.
- అతని శరణులో వుండి లేదా అతనితో సంబంధాన్ని ఏర్పరచుకుని నేను ప్రశాంతతను, స్థిమితాన్ని పొందాను.
- కష్టం లేదా ఆపద విరుచుకుపడవచ్చు అని మనిషి భయాందోళనకు గురి అయినప్పుడు అతన్ని మరొక వ్యక్తి ఆదుకున్నాడు.
- మనిషి అత్యంత శ్రద్ధతో ఇతరుల వైపు మొగ్గుచూపాడు.
- తల్లి నుండి తప్పిపోయిన ఒంటె పిల్ల తిరిగి దాని ఒడి చేరి హత్తుకు పోవడం.
- దాగివున్న లేదా మరుగున పడివున్న.
- మహోన్నతుడయ్యాడు.
- దాస్యం చేశాను. సేవించాను.

పై వాటన్నింటి భావాలను పరిశీలించినట్లయితే; దాని మూల భావం దాస్యం లేదా పూజ అని అర్థమవుతుంది. అలాగే 'ఇలాహ్' (దేవుడు) అంటే ఆరాధ్యుడు అని తెలుస్తుంది.

1) మనిషి మదిలో 'ఆరాధించాలి' అనే భావన తన అవసరాలకొద్దీ పుడుతుంది. అతను తన అవసరాలు తీర్చగలడనీ, ఆపదలు, కష్టాల సమయంలో తనను ఆదుకుంటాడనీ ఇంకా తాను వ్యాకులతకు గురి అయినప్పుడు ప్రశాంతతను ప్రసాదిస్తాడు అన్న గట్టి నమ్మకం కలుగనంత వరకు ఎవరినైనా ఆరాధించాలి లేదా పూజించాలి అన్న ధ్యాసను కనీసం మనసులో కూడా రానివ్వడు మనిషి.

2) మరో విషయమేమంటే, మనిషి ఎవరినైతే తన అవసరాలు తీర్చగలవాడని భావించి అతనితో పటిష్టమైన సంబంధాన్ని కలిగి వున్నాదో, అతను కేవలం హోదాను బట్టి లేదా స్థానాన్ని బట్టి కాక శక్తిసామర్థ్యాలను బట్టి కూడా తనకన్నా గొప్పవాడు శక్తిమంతుడయి ఉండాలి అని భావిస్తాడు.

3) మరో వాస్తవమేమంటే, ప్రకృతి సహజంగా ఏ ఏ కారకాల ద్వారానయితే తన అవసరాలు తీరుస్తుందో, ఆ ప్రక్రియ తన కళ్ళ ముందే లేక తన జ్ఞాన పరిధి లోనే జరుగుతున్నప్పటికీ, అలా తన అవసరాలు తీరుస్తున్న వాటిని ఆరాధించాలి అనే భావన కలుగనే కలుగదు. ఉదాహరణకు : నాకు ఖర్చుల నిమిత్తం డబ్బుల అవసరం కలిగి, నేను ఎవరి వద్దకైనా వెళ్ళి ఉద్యోగం కోసం లేదా కూలి కోసం విన్నపం చేసుకున్నాను. అతను నాపై జాలిపడి నాకు పని చూపడమే కాక, దాని ప్రతిఫలాన్ని కూడా ఇచ్చాడు. ఇదంతా నా కళ్ళ ముందే, నా జ్ఞాన పరిధిలోనే జరిగింది గనుక ఇంకా నా అవసరం తీరింది కూడా ఆయన ద్వారానేనన్న సంగతి కూడా నాకు తెలుసు. గనక ఒక్క క్షణమైనా ఆయనను ఆరాధించాలి లేదా ఆయనకు దాస్యం చేయాలనే భావన నా మదిలో కలగదు. ఎవరినయినా ఆరాధించాలి లేదా దాస్యం చేయాలి అన్న భావన నాలో ఎప్పుడు కలుగుతుందంటే, ఆ వ్యక్తిత్వంపై లేదా వాని శక్తిసామర్థ్యాలపై లేదా మన అవసరాలు తీర్చగల అతని శక్తిసామర్థ్యాలపై ఏదైనా అదృశ్య తెర పడి ఉండాలి. అప్పుడు మాత్రమే అది సాధ్యం అవుతుంది. అందుకే ఆరాధ్యుడు

అన్న పదంలో ఔన్నత్యంతపాటు నిగూఢమైన, ఆశ్చర్యకరమైన అనే భావం కూడా దాగివున్నది అని తెలుస్తుంది.

4) అలాగే ఎలాంటి పరిస్థితుల్లోనైనా తన అవసరాలను తీర్చగలడని, ఆపదల సమయంలో రక్షణ కల్పిస్తాడని, వ్యాకులతకు గురి అయినప్పుడు ప్రశాంతత ప్రసాదిస్తాడని నమ్మకం దేనిపైనయితే కలుగుతుందో దాని వైపునకే మనిషి మనస్ఫూర్తిగా మరలడమన్నది అనివార్య అంశం. దీన్నిబట్టి తెలిసే దేమిటంటే ఆరాధ్యునికై 'దేవుడు' అన్న పదానికి ఈ క్రింది భావాల మూలంగా తీసుకోవడం జరిగింది :

అవసరాలను తీర్చేవాడు. ఆశ్రయమిచ్చేవాడు, ప్రశాంతతను ప్రసాదించేవాడు, సర్వాధికుడు, సర్వోన్నతుడు.

ధర్మబద్ధమైన స్వామిగా, సకల అవసరాలు తీర్చగలవానిగా, శరణు కల్పించగల అధికారంగల యజమానిగా, ఇంకా ఆయన అధికారం, ఆధిపత్యం విశ్వమంతా ప్రభావం చూపగల శక్తిసామర్థ్యాలుగల యజమానిగా భావించి, మనిషి ఎవరిపైనయితే ఆశలు పెంచుకుంటాడో, ఆయనే నిజమైన దేవుడు.

## అజ్ఞాన కాలంలో దైవభావన

మూల అర్థాన్ని విశ్లేషించిన తరువాత ఖుర్‌ఆన్ సంస్కరించాలనుకుంటున్న ఆ అజ్ఞాన కాలపు అరబ్బులలో దైవత్వానికి సంబంధించి ప్రబలివున్న భావాలు ఏమిటి? అన్నది ఇప్పుడు మనం తెలుసుకోవలసిన అసలు విషయం.

> "వారు అల్లాహ్‌ను కాదని కొందరిని తమ దేవుళ్ళుగా చేసుకున్నారు. తమకు వారు అండగా ఉంటారని భావించారు (లేదా వారి సంరక్షణలో సురక్షితంగా ఉంటారని భావిస్తున్నారు)." *(మర్యమ్ : 81)*

> "వారు అల్లాహ్‌ను కాదని ఇతరులను దేవుళ్ళుగా చేసుకున్నారు. తమకు

సహాయం చేయటం జరుగుతుందని వారు ఆశలు పెట్టుకున్నారు (అనగా వారు భావిస్తున్న దేవుళ్ళు వారికి సహాయపడతారని భావించారు) *(యూసీన్ : 74)*

పై రెండు వాక్యాల ద్వారా తెలిసేదేమిటంటే, అజ్ఞానకాలంలో అరబ్బులు ఎవరినయితే దేవుళ్ళుగా పిలిచేవారో, వారు వారిని తమ సంరక్షకులుగా భావించేవారు. కష్టకాలంలో, ఆపద సమయాలలో వారు తమను ఆదుకుంటారని, ఇంకా వారికి వత్తాసు పలకటం వల్ల తాము భయం నుండి, నష్టాల బారి నుండి సురక్షితంగా ఉంటామని భావించేవారు.

"అల్లాహ్ ఆజ్ఞ వచ్చేసినప్పుడు, అల్లాహ్‌ను వదలి వారు ప్రార్థిస్తూ వచ్చిన దేవుళ్లు వారికి ఏ విధంగానూ సాయపడలేదు. ఆ దేవుళ్ళు వారికి వినాశం విధ్వంసం తప్ప ఏ ప్రయోజనాన్నీ సమకూర్చలేదు". *(హూద్ : 101)*

"అల్లాహ్‌ను వదలి ప్రజలు వేడుకుంటున్న ఇతర శక్తులు ఏ వస్తువుకూ సృష్టికర్తలు కారు. వారు స్వయంగా సృష్టించబడిన వారు, నిర్జీవులే కాని సజీవులు కారు. వారు మళ్ళీ ఎప్పుడు బ్రతికించి లేపబడనున్నారో వారికెంత మాత్రం తెలియదు. మీ దేవుడు కేవలం ఒక్కడే".

*(అన్ నహ్ల్ : 20-22)*

"అల్లాహ్‌తోపాటు ఏ ఇతర దేవుణ్ణి వేడుకోకు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడెవ్వడూ లేడు".[1] *(ఖసస్-88)*

---

1. *ఇక్కడ గమనించవలసిన విషయమేమంటే, ఖుర్‌ఆన్‌లో దేవుడు అనే పదాన్ని రెండు అర్థాలలో వాడటం జరిగింది. ఒకటి: ఇప్పుడు మీరు ఆరాధిస్తున్న దేవుడు (ఆయన వాస్తవం లేక కల్పితం ఏమైనప్పటికిని). రెండు: వాస్తవంగా ఎవరైతే ఆరాధ్యానికి అర్హుడో ఆ నిజదైవం. ఇక్కడ దేవుడు అనే పదాన్ని రెండు చోట్లా ఈ రెండు వేర్వేరు అర్థాలలో వాడటం జరిగింది.)*

"అల్లాహ్‌ను కాదని తాము కల్పించిన కొందరు భాగస్వాములను వేడుకుంటున్న వారు కేవలం భ్రమనూ, అనుమానాన్నీ అనుసరిస్తు న్నారు. కేవలం ఊహాగానాలు చేస్తున్నారు. *(యూనుస్ : 66)*

పై వాక్యాల ద్వారా వెలుగులోకి వస్తున్న మరికొన్ని విషయాలలో ఒకటి: అజ్ఞాన కాలంలో ప్రజలు ఎవరినైతే దేవుళ్ళుగా కొలిచేవారో వారు ఆపద్బాంధవు లని, అవసరాలను తీర్చేవారని భావించి, వారిని వేడుకునే వారు. రెండవది: ఎవరినైతే వీరు దేవుళ్ళుగా భావించేవారో వారు కేవలం జిన్నులు, దైవదూతలు, దేవతలే కాక చనిపోయిన తమ పూర్వీకులు కూడా ఇందులో ఉన్నారు. మూడవ విషయం: ఎవరినైతే వీరు దైవాలుగా కొలిచేవారో వారు తమ వేడుకోళ్ళు వింటారని, తమకు సహాయపడగల శక్తిగలవారని భావించే వారు.

ఇక్కడ మనం ఏ నమ్మకంతో దైవాన్ని వేడుకుంటున్నామో, ఆ వేడుకోలు భావన, దాని పరిధి ఏమిటో? తప్పనిసరిగా తెలుసుకోవాలి. ఒకవేళ నాకు దాహం వేసి, పనివాడిని నీళ్ళు ఇవ్వమని కోరాననుకోండి లేదా నాకేదైనా జబ్బు చేసి డాక్టరును పిలిచాననుకోండి. ఇది వారితో వేడుకోలు (దుఆ)చేసినట్లో లేక ఆ పనివాడిని లేక డాక్టరును దేవునిగా భావించినట్లో కాదు. ఎందుకంటే ఈ తతంగమంతా భౌతిక కారకాలకు లోబడి జరిగింది. ఒకవేళ నేను దాహం వేసినప్పుడు లేదా జబ్బు చేసినప్పుడు పని వాడిని లేదా డాక్టరును కాక మరే వలీనో (పుణ్యపురుషుడినో) లేక ఏ దేవతనో పిలిస్తే ఇది తప్పనిసరిగా వారిని దైవంగా భావించి వేడుకోవడమే అవుతుంది. ఎందుకంటే, ఎక్కడో వేల మైళ్ళ దూరంలో సమాధిలో విశ్రాంతి తీసుకుంటున్న ఆ వలీని వినేవాడిగా, చూసే వాడిగా ఈ విశ్వ వ్యవస్థపై ఆయనకు అధికారమున్నది కనుక ఆయన తన మహిమతో నా వరకు నీళ్ళు చేరే ఏర్పాటు చేయగలరని లేదా నా జబ్బును నయం చేసేయగలడని భావిస్తున్నాను. కాబట్టి ఇలాంటి సమయాలలో ఏ దేవతనో వేడుకుంటున్నాను అంటే అర్థం, వారికి నీళ్ళు, ఆరోగ్యం ప్రసాదించే

లేక జబ్బును నయం చేయడంపై అధికారం, ఆధిపత్యం ఉన్నదని భావించడమే అవుతుంది. ఇంకా వారు పరోక్షంగా నా అవసరాలు తీరేలా వాటిని పని చేయిస్తారు అన్న నమ్మకంతో వారిని దేవుళ్ళుగా భావించి వేడు కున్నట్లు అవుతుంది.

"మీ చుట్టుప్రక్కల ప్రాంతాలలోని ఎన్నో జనపదాలను మేము నాశనం చేసివేశాము. మేము మా వాక్యాలను పంపి మాటిమాటికి రకరకాలుగా వారికి నచ్చజెప్పాము. బహుశా వారు దారికి వస్తారేమో అని. అల్లాహ్‌ను వదలిపెట్టి, వారు ఏ శక్తులను అల్లాహ్ సాన్నిధ్యాన్ని పొందటానికి సాధనాలుగా భావించి ఎందుకు దైవాలుగా చేసుకున్నారో, ఆ శక్తులు వారికి ఎలాంటి సహాయం చేయవు? పైగా వారికి కనుమరుగైపోయాయి. ఇది వారి అబద్ధాలకూ వారు కల్పించుకున్న కృత్రిమ విశ్వాసాలకూ పర్యవసానం". *(అహ్ఖాఫ్ : 27,28)*

"ఎవరు నన్ను సృష్టించారో, ఎవరి వైపునకు మీరంతా మరలి పోనున్నారో, ఆయనను నేనెందుకు పూజించకూడదు? ఆయనను కాదని నేను ఇతరులను ఆరాధ్య దైవాలుగా భావించాలా? వాస్తవానికి ఒకవేళ కరుణామయుడైన దేవుడు నాకేదైనా నష్టం కలిగించదలిస్తే నాకు వారి సిఫారసు ఏ విధంగానూ ఉపయోగపడదు, వారు నన్ను విడిపించనూ లేరు. *(యాసీన్ : 22,23)*

"నిజదైవమైన అల్లాహ్‌ను వదలివేసి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నవారు (తమ ఈ చర్యకు కారణంగా) 'వారు మమ్మల్ని అల్లాహ్ వద్దకు చేరుస్తారని మాత్రమే మేము వారిని ఆరాధిస్తున్నాము' అని అంటారు. అల్లాహ్ నిశ్చయంగా వారి మధ్యన వారు విభేదిస్తున్న అన్ని విషయాలను గురించి తీర్పు చెబుతాడు". *(జుమర్ : 3)*

"ఈ ప్రజలు అల్లాహ్‌ను కాదని తమకు నష్టాన్నిగానీ, లాభాన్నిగానీ కలిగించలేని వారిని పూజిస్తున్నారు. పైగా ఇలా అంటున్నారు: వారు

అల్లాహ్ వద్ద మా కొరకు సిఫారసు చేస్తారు". *(యూనుస్ : 18)*

ఖుర్‌ఆన్‌లోని పై వాక్యాలను పరిశీలించినట్లయితే మనకు అర్థమయ్యే విషయం ఏమిటంటే, అజ్ఞాన కాలం ప్రజలు దైవత్వమంతా తాము ఆరాధించే దేవుళ్ళ మధ్యనే విభజింపబడి ఉందనీ వారిపై (తాము నమ్మే దైవాలపై) ఒక పరమ ప్రభువు ఆధిపత్యం లేదా అజమాయిషీ లేదని భావించేవారు కాదు. మహోన్నతుడైన పరమ ప్రభువు ఒకడున్నాడన్న ప్రబల నమ్మకం వారికి ఉండేది. ఆయననే అల్లాహ్ అని కూడా పిలిచేవారు. కాకపోతే ఎవరినైతే వీరు దైవాలుగా భావిస్తున్నారో వారు కూడా ఆ మహోన్నత ప్రభువు దైవత్వంలో భాగస్వాములని, వారి మాటకు కూడా విలువ ఉంటుందని, వారి సిఫారసుతో తమకు లాభం చేకూరుతుందని, ఇంకా నష్టాల నుంచి కాపాడబడుతామని నమ్మి, వారిని అల్లాహ్‌తోపాటుగా దైవాలుగా కొలిచేవారు. కనుక వారి పరిభాషలో ఎవరినైనా అల్లాహ్ వద్ద సిఫారసు చేసేవారిగా భావించి, తమకు సహాయపడమని వేడుకోవడం, వారి ఎదుట భక్తిశ్రద్ధలతో ప్రణమిల్లటం వారికి మొక్కుబడులు చెల్లించడం వారిని దేవుళ్ళుగా చేసుకోవడమే అవుతుంది.[1]

1. *ఇక్కడ మనం బాగా తెలుసుకోవలసిన విషయమేమిటంటే, సిఫారసులు రెండు రకాలు. ఒకటి: తన అధికారంతో లేదా బలప్రయోగం ద్వారా ఎట్టి పరిస్థితుల లోనూ తన సిఫారసును అంగీకరింపజేయగలగడం. రెండోది: సిఫారసు అంటే కేవలం ఒక అభ్యర్థన, వేడుకోలు మాత్రమే అయి వుండటం. అంటే ఇక్కడ తన సిఫారసును అంగీకరింపజేసుకోవడానికి ఎలాంటి బలప్రయోగం ఉండదు. మొదటి భావన ప్రకారం, ఎవరినయినా సిఫారసు అంగీకరించేలా చేసేవాడిగా భావించడమంటే అతన్ని దేవుడిగా భావించడం, అల్లాహ్‌కు సాటి కల్పించడమన్న మాట. ఈ భావననే ఖుర్‌ఆన్ ఖండిస్తుంది. ఇక రెండవ భావన ప్రకారం, దైవప్రవక్తలు, దూతలు, సజ్జనులు, విశ్వాసుల వర్గం దైవదాసులందరు మరొకరి కోసం సిఫారసు చేయడం, కాగా, ప్రభువుకు వారి ఈ సిఫారసును అంగీకరించే లేదా తిరస్కరించే పూర్తి అధికారమున్నది.*

"అల్లాహ్ ఇలా ఆజ్ఞాపించాడు. ఇద్దరిని దేవుళ్ళుగా చేసుకోకండి. దేవుడు మటుకు ఒక్కడే కనుక మీరు నాకే భయపడండి."

*(అన్ నహ్లా : 51)*

ఇబ్రాహీం (అలై) ఇలా అన్నారు: "మీరు నిలబెట్టిన భాగస్వాములకు నేను భయపడను. అయితే నా ప్రభువు ఏదైనా కోరితే అది తప్పకుండా జరగవచ్చు".

*(అన్ ఆమ్: 80)*

"హూద్ జాతివారు ఇలా అన్నారు : "నీపై మా ఆరాధ్య దైవాలలో ఎవరి దెబ్బ అయినా పడిందని మేము అనుకుంటున్నాము." *(హూద్ : 54)*

పై వాక్యాల ద్వారా తెలిసేదేమిటంటే, అజ్ఞాన కాలంలో ప్రజలు తాము ఆరాధించే దేవుళ్ళకు ఆగ్రహం కలిగించే పనులేమైనా చేసినా లేక వారిని అవమానించినా లేక వారిని విస్మరించినా తమపై రోగాలు, కరువు కాటకాలు, ధన ప్రాణ నష్టాలు, ఇతర అనేక ఆపదలు సంభవిస్తాయని భయపడేవారు.

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు. ఇంకా అదే విధంగా మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి ఒకే దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు. "

*(తౌబా : 31)*

"తన మనోవాంఛను తన దేవుడుగా చేసుకున్న వ్యక్తి యొక్క స్థితిని ఎప్పుడైనా నీవు గమనించావా? నీవు అలాంటి వ్యక్తిని రుజుమార్గానికి తెచ్చే బాధ్యతను స్వీకరించగలవా?"

*(అల్ ఫుర్ఖాన్ : 43)*

"ఇదే విధంగా చాలా మంది ముష్రిక్కులకు (బహుదైవారాధకులు) తమ సంతాన హత్య వారు నిలబెట్టిన భాగస్వాములు సరైనదిగా కనిపించేలా చేశారు."

*(అన్ ఆమ్ : 137)*

"అల్లాహ్ అనుమతించకుండానే ధర్మం వంటి స్వభావం గల ఒక

విధానాన్ని తమ కొరకు రూపొందించిన దైవ భాగస్వాముల నెవరినైనా వారు కలిగి ఉన్నారా?" *(అష్ షూరా: 21)*

ఈ వాక్యాలలో ఇంతకు ముందు వచ్చిన దైవభావాలకు పూర్తి విరుద్ధంగా, దేవుడు అనే భావనకు అర్థాన్ని మరో రూపంలో చూస్తాం. ఇక్కడ దేవుడు అంటే సర్వసత్తాక ప్రభువు అన్న భావనలేదు. ఇక్కడ తనలాంటి మరో మనిషిని లేదా తన మనోవాంఛను దేవుడిగా భావించడం జరిగింది. ఇక్కడ వారు తమ వేడుకోలు వింటారనిగాని లేక తమకు లాభనష్టాలు కలిగించ గలరని గాని లేదా వారి శరణు పొందాలని భావించిగాని వారిని దేవుళ్ళుగా చేసుకో లేదు. లేక వారి ఆజ్ఞలనే శాసనాలుగా భావించాలని లేక వారికి ఆజ్ఞా బద్ధులవ్వాలని, వారు తెలిపిన ధర్మాన్నే ధర్మంగా లేక ఆ ధర్మాన్ని అధర్మంగా భావించో లేక స్వయంగా ఆజ్ఞలనిచ్చే లేక దేన్నయినా నిషేధించే శక్తిగల వారిగా భావించో లేక వారిని మించిన అధికారంగల వారెవ్వెరు లేరని భావించి వారిని దైవాలుగా చేసుకోలేదు.

మొదటి ఆయతులలో (వాక్యాలలో) పండితులను, సన్యాసులను దేవుళ్ళుగా భావించిన ప్రస్తావన వచ్చింది. దీని పూర్తి వివరణ ప్రవక్త (స) గారి ఈ ప్రవచనం (హదీసు) ద్వారా మనం తెలుసుకోవచ్చు. హజ్రత్ ఆదీ బిన్ హాతిమ్ (రఅ) ఈ సూక్తికి సంబంధించి దైవప్రవక్త(స)ను ప్రశ్నించగా, ప్రవక్త(స) ఇలా తెలియజేశారు : దేన్నయితే మీ పండితులు సన్యాసులు ధర్మ సమ్మతం చేశారో దాన్ని ధర్మమైనదిగా, మరి దేన్నయితే అధర్మమైనదిగా నిర్ణయించారో దాన్ని అధర్మమైనదిగా మీరంతా శిరసావహించేవారు. ఈ విషయంలో 'అల్లాహ్ ఆదేశం ఏమిటి?' అని పట్టించుకోకపోవడం వారిని దైవాలుగా భావించడం అవుతుంది".

ఇక రెండవ వాక్యపు భావం చాలా స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఎవరయితే తన మనోవాంఛలను అనుసరించారో, దాని ఆజ్ఞలను శిరసా వహించారో వారు వాస్తవానికి తమ మనోవాంఛలనే దేవుళ్ళుగా చేసుకున్నారు.

దాని తరువాతి రెండు వాక్యాలలో దేవుడికి బదులుగా భాగస్వాములు అంటే దైవత్వంలో భాగస్వాములని అర్థం. ఈ రెండు వాక్యాల ద్వారా చాలా స్పష్టంగా తెలిసేదేమిటంటే, ఎవరయితే అల్లాహ్ ఆజ్ఞలను స్వీకరించటానికి బదులుగా మరొకరు నిర్దేశించిన సంప్రదాయాన్ని లేక పద్ధతిని ఎలాంటి ప్రమాణం లేకుండానే- సరిఅయిన శాసనంగా భావిస్తున్నారో వారు ఆ శాసన నిర్మాతను దేవుని దైవత్వంలో భాగస్వామిగా చేరుస్తున్నారు.

## దైవత్వపు గుణగణాలు

దైవం గురించి పైన పేర్కొన్న భావాలన్నింటి మధ్య ఏదో ఒక విధంగా అవినాభావ సంబంధం కనిపిస్తుంది. ఎవరయితే సర్వసత్తాక ప్రభువుగా, తన సహాయకునిగా, ఆపద్బాంధవుడిగా, అవసరాలను తీర్చేవాడిగా, మొరలాల కించే వాడిగా, లాభనష్టాలను కలిగించేవాడిగా భావించి ఎవరినయినా ఆరాధించడానికి కారణం, అతను ఈ విశ్వ వ్యవస్థలో ఏదో ఒక రూపంలో అధికారాన్ని, ఆధిపత్యాన్ని కలిగిఉన్నాడని నమ్మడమే. అలాగే ఎవరయినా ఒకరి పట్ల భయభక్తులు కలిగి అతన్ని అప్రసన్నత తనకు నష్టాన్ని కలిగిస్తుందని, అతని ప్రసన్నత తనకు లాభాన్ని చేకూర్చుతుందన్న నమ్మకం, ఆచరణ కలిగి వుండటానికి కారణం కూడా అతను నమ్మే దేవుళ్ళకు ఈ విశ్వ వ్యవస్థ సృష్టి వ్యవహారాలలో ఏదో ఒక రూపంలో అధికారం, శక్తిసామర్థ్యాలను కలిగి వున్నారని భావించడమే. అలాగే ఎవరైనా విశ్వ ప్రభువును విశ్వసించిన తరువాత కూడా ఆయనతోపాటు ఇతర దేవుళ్ళను తన అవసరాలకై వేడుకోవడానికి కారణం వారిని ఆ విశ్వప్రభువు అధికారంలో ఎంతో కొంత భాగస్వామ్యమున్నదని భావించడమే. అలాగే ఎవరి ఆజ్ఞనైనా శాసనంగా భావించి వారికి విధేయతను చూపడం కూడా వారిని తమ సర్వోన్నత అధికారిగా భావించడమే అవుతుంది. దీనిని బట్టి తెలిసేదేమిటంటే, అధికారమనేది దైవత్వానికి ఆత్మలాంటిది. ఆ అధికారం ఈ విశ్వవ్యవస్థను నడిపే సర్వసత్తాక అధికారం

కావచ్చు లేదా మనిషి తన ప్రాపంచిక జీవిత వ్యవహారాలలో ఆయన ఆజ్ఞలను లేదా చట్టానికి లోబడి విధేయత చూపే అధికారం కావచ్చు.

## ఖుర్ఆన్ వాదన

అధికార, ఆధిపత్య భావన ఇదే. దీని ఆధారంగానే ఖుర్ఆన్ తన సర్వస్వాన్నీ మిథ్యాదైవాల దైవత్వాన్ని ఖండించటానికీ, ఒక్కడైన అల్లాహ్ దైవత్వాన్ని నిరూపించటానికి వెచ్చిస్తుంది. ఖుర్ఆన్ వాదన ఏమిటంటే, మీ దేవుడు ఒక్కడే. ఆయనే ఈ భూమ్యాకాశాలలో సర్వాధికారాలకు స్వామి. సర్వసత్తాక ప్రభువు. ఆయనే ఈ సృష్టిలోని సకల జీవరాశులను సృష్టించాడు. అనుగ్రహాలన్నీ ఆయన ప్రసా దితమే. ఆయనే శాసన ప్రదాత. సర్వశక్తులు, అధికారాలకు యజమాని ఆయన ఒక్కడే. సృష్టిలోని ప్రతీ వస్తువు తమకు ఇష్టమున్నా లేకున్నా ఆయన విధేయతకే కట్టుబడి ఉన్నాయి. ఈ విశ్వవ్యవస్థలో ఆయనకు తప్ప మరెవరికీ ఎలాంటి అధికారంలేదు. ఎవరి ఆజ్ఞా చెల్లదు. ఇంకా ఈ సృష్టి వ్యవహారాల రహస్యాన్నె రిగిన వారు కూడా ఎవ్వరూ లేరు. అంతేకాదు, ఆయన సార్వభౌమత్వంలో ఎవరికీ రవ్వంత అయినా భాగస్వామ్యం లేదు. కనుక ఆయన తప్ప మరో దేవుడు లేనేలేడు. ఆయన తప్ప మరో దేవుడు లేనప్పుడు మీరు మరొకరిని దేవునిగా తలచడం మహానేరం. కనుక దైవేతరులతో ఏదైతే మీరు సంబంధాన్ని కలిగి వున్నారో – అది మీ వేడుకోలుగానీ, శరణు పొందడంగానీ, భయభక్తులు కలిగి ఉండటంగానీ, ప్రసన్నత చేసుకోవడం, సిఫారసు కోరడం లేదా వారి ఆజ్ఞలకు విధేయులై ఉండటంగానీ– అన్నీ కేవలం అల్లాహ్‌కు మాత్రమే చెందాలి. ఎందుకంటే, ఈ సర్వసృష్టికి ధర్మబద్ధమైన సర్వాధికారి కేవలం అల్లాహ్ ఒక్కడే.

ఈ విషయంలో ఖుర్ఆన్ వాదనను వినండి :

"ఆకాశంలోనూ, భూమిలోనూ దేవుడు ఆయన ఒక్కడే. ఆయనే వివేక వంతుడు, జ్ఞాన సంపన్నుడు. *(అజ్ జుఖ్‌రుఫ్ : 84)*

"సృష్టించేవాడూ, అసలు ఏమీ సృష్టించని వాడూ ఉభయులూ సమాను లేనా? మీరు ఈ మాత్రం అర్థం చేసుకోలేరా?" *(అన్ నహ్ల్ : 17)*

"అల్లాహ్‌ను వదలి, ప్రజలు వేడుకుంటున్న ఇతర శక్తులు ఏ వస్తువుకూ సృష్టికర్తలు కారు. వారు స్వయంగా సృష్టించబడినవారే."

*(అన్‌నహ్ల్ : 20)*

"మీ దేవుడు కేవలం ఒకే దేవుడు". *(అన్‌నహ్ల్ : 22)*

"మానవులారా! అల్లాహ్ మీకు చేసిన ఉపకారాలను జ్ఞాపకం ఉంచు కోండి. అల్లాహ్ కాక భూమ్యాకాశాల నుండి మీకు ఉపాధినిచ్చే మరొక సృష్టికర్త కూడా ఎవడైనా ఉన్నాడా? ఆయన తప్ప మరొక ఆరాధ్యు డెవ్వడూ లేడు. అసలు మీరు ఎవని వల్ల మోసపోతున్నారు?"

*(ఫాతిర్ : 3)*

(ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను : "మీరెప్పుడైనా ఆలోచించారా, అల్లాహ్ మీ చూపును, మీ వినికిడిని మీ నుంచి లాక్కుంటే, మీ హృద యాలకు ముద్రవేస్తే, మళ్ళీ మీకు ఈ శక్తు లను అల్లాహ్ తప్ప తిరిగి ఇవ్వగల మరొక దేవుడెవడున్నాడు?" *(అన్ ఆమ్ : 46)*

ఆయనే అల్లాహ్. ఆయన ఒక్కడు, ఆయన తప్ప ఆరాధనకు అర్హు డెవ్వడూ లేడు. ఈ లోకంలోనూ, పరలోకంలోనూ ఆయనే స్తుతింప దగినవాడు, పరిపాలనాధికారం ఆయనదే. ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు. ప్రవక్తా! వారితో ఇలా అను: "ఈ విషయం గురించి మీరెప్పుడైనా ఆలోచించారా; ఒకవేళ ప్రళయం వచ్చే వరకు మీపై శాశ్వతంగా రాత్రిని ఆవహింపజేస్తే, అల్లాహ్ తప్ప మీకు వెలుగును తెచ్చి ఇచ్చే దేవుడు ఎవడు? మీరు వినరా??" వారిని ఇంకా ఇలా అడుగు, "ఈ విషయం గురించి మీరెపుడైనా ఆలోచించారా; ఒకవేళ అల్లాహ్ ప్రళయం వరకు మీపై పగలును శాశ్వతంగా ఉండేలా

చేస్తే, మీరు విశ్రాంతి పొందటానికి అల్లాహ్ తప్ప మీకు రాత్రిని తెచ్చి ఇచ్చే దేవుడెవడైనా ఉన్నాడా? మీకేమీ గోచరించటం లేదా?" మీరు బొత్తిగా వినరేమిటి?" *(ఖసస్ : 70-72)*

ప్రవక్తా! ఈ బహుదైవారాధకులతో ఇలా అను, "అల్లాహ్‌ను కాదని మీరు ఆరాధ్యులుగా భావించిన వారిని పిలిచి చూడండి. వారు ఆకాశాలలోగాని, భూమిలోగాని, రవ్వంత వస్తువుకు కూడా యజ మానులు కారు. ఇంకా వారు భూమ్యాకాశాల ఆధిపత్యంలోనూ భాగస్వాములు కారు. వారిలో ఎవ్వడూ అల్లాహ్‌కు సహాయకుడూ కాడు, అల్లాహ్ ఏ వ్యక్తి విషయంలో సిఫారసుకు అనుమతి ఇచ్చాడో, ఆ వ్యక్తికి తప్ప మరెవరికినీ ఏ సిఫారసూ అల్లాహ్ సమక్షంలో లాభదాయకం కాదు.

*(సబా : 22- 22,23)*

"ఆయన ఆకాశాలనూ, భూమినీ సత్యంతో సృష్టించాడు. ఆయనే పగటిని రేయితోనూ రేయిని పగటితోనూ చుట్టివేస్తాడు. ఆయనే సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ నియమబద్ధులుగా చేసి ఉంచాడు. వాటిలో ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీత కాలం వరకు సంచరిస్తూ ఉంటుంది..... ఆయనే మిమ్మల్ని ఒకే ప్రాణి నుంచి పుట్టించినవాడు, తిరిగి ఆయనే ఆ ప్రాణి నుంచి దాని జంటను సృజించాడు. ఆయనే మీ కొరకు పశువులలో ఎనిమిది మగ, ఆడ జాతులను సృష్టించాడు. ఆయన మీ తల్లుల గర్భాలలో మూడేసి చీకటి[1] తెరలలో మీకు ఒక రూపం తరువాత మరొక రూపాన్ని ఇస్తూ పోతున్నాడు. (ఈ పనులన్నీ చేసే) ఈ దేవుడే మీ ప్రభువు. సృష్టి సామ్రాజ్యం ఆయనదే. ఆయన తప్ప మరొక దేవుడు ఎవ్వడూ లేడు. అలాంటప్పుడు మీరు ఎటు మరలింపబడుతున్నారు?".

*(జుమర్ : 5,6)*

---

1. మూడు చీకటి పొరలు అంటే 1. పొట్ట (ఉదరము), 2. గర్భాశయము 3. పిండాన్ని ఆవరించి ఉండే సన్నని పొర అని అర్థము.)

"ఆకాశాలనూ భూమినీ ఎవరు సృష్టించారు? మీ కొరకు ఆకాశం నుండి నీటిని కురిపించి, తద్వారా మనోహరమైన తోటలను ఎవరు పండించారు? వాటిలోని చెట్లను మొలిపించటం మీకు సాధ్యమయ్యే పని కాదు. అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు కూడా ఎవడైనా ఉన్నాడా? కాని వారే ఋజుమార్గం నుండి తొలగిపోతున్నారు. భూమిని నివాస స్థలంగా చేసినవాడు ఎవడు? అందులో నదులను ప్రవహింపజేసిన వాడు, దాని మీద (పర్వతాల మీద) మేకులను పాతినవాడు ఎవడు? రెండు రకాల జలధుల మధ్య (సముద్రాల నీటి మధ్య) అడ్డు తెరలను పెట్టినవాడు ఎవడు? అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు కూడా ఎవడైనా ఉన్నాడా? (ఈ పనులలో పాలుపంచు కోవటానికి) లేదు. కాని వారిలో అనేక మందికి తెలియదు. కలత చెందినవాడు మొరపెట్టుకున్నప్పుడు, అతని మొరను ఆలకించి అతని వ్యాకులతను తొలగించేవాడు ఎవడు? భూమిపై మిమ్మల్ని ప్రతినిధులుగా చేసినవాడు ఎవడు? అల్లాహ్‌తో పాటు (ఈ పనులు చేసే) మరొక దేవుడు కూడా ఎవడైనా ఉన్నాడా? మీరు చాలా తక్కువగా ఆలోచిస్తారు. నేలపై, సముద్రంపై అంధ కారంలో మీకు దారి చూపేవాడు ఎవడు? తన కారుణ్యానికి ముందు గాలులను శుభవార్తతో పంపేవాడు ఎవడు? అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా (ఈ పనులు చేయటానికి)? వారు చేస్తూ ఉన్న షిర్క్‌కు అల్లాహ్ ఎంతో అతీతుడు. ఎంతో ఉన్నతుడు. సృష్టిని మొదటిసారిగా చేసినవాడు ఎవడు? దానిని పునఃసృష్టించేవాడు ఎవడు? నింగి నుండి, నేల నుండి మీకు ఉపాధినిచ్చేవాడు ఎవడు? అల్లాహ్‌తోపాటు మరొక దేవుడు ఎవడైనా ఉన్నాడా (ఈ పనులలో పాలు పంచుకోవటానికి)? మీరు సత్యవంతులే అయితే మీ ఆధారాన్ని తీసుకురండి" అని అడుగు.[1] *(అన్ నమ్ల్ : 60-64)*

---

1. ఈ పనులన్నీ చేస్తున్నది అల్లాహ్‌యేనని, ఇందులో ఎవరికీ ఎలాంటి భాగ స్వామ్యం లేదని మీరు నమ్ముతున్నప్పుడు మీరు ఏ ఆధారంతో దైవత్వంలో

"ఆయన భూమ్యాకాశాల సామ్రాజ్యానికి ప్రభువు. ఆయన ఎవరినీ కుమారుడిగా చేసుకోలేదు. విశ్వసామ్రాజ్యాధిపత్యంలో ఆయనకు భాగస్వాములెవ్వరూ లేరు. ఆయన ప్రతి దానినీ సృష్టించాడు. తరువాత దానికి ఒక విధినీ నిర్ణయించాడు. ప్రజలు ఆయనను కాదని కల్పించు కున్నట్టి దేవుళ్ళు ఏ వస్తువునూ సృష్టించలేరు. కాని వారే సృష్టింపబడ తారు. వారు స్వయంగా తమ కొరకైనా ఏ లాభనష్టాల అధికారాన్నీ కలిగిలేరు. వారు చంపనూ లేరు, బ్రతికించనూలేరు. మరణించిన వాణ్ణి మళ్ళీ లేపనూలేరు". *(అల్ ఫుర్ఖాన్ : 2,3)*

"ఆయన ఆకాశాలనూ, భూమినీ ప్రభవింపజేసినవాడు. ఆయనకు ఒక జీవిత సహచరి అంటూ లేనప్పుడు, ఆయనకు కొడుకు ఎలా ఉంటాడు? ఆయన ప్రతి వస్తువునూ పుట్టించాడు. ఆయనకు ప్రతి వస్తువు గురించీ తెలుసు. ఆయనే అల్లాహ్, మీ ప్రభువు. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ఆయన సర్వానికీ సృష్టికర్త. కనుక మీరు ఆయననే ఆరాధించండి. ఆయన ప్రతి దానికీ సంరక్షకుడు.

*(అల్ అన్ ఆమ్: 101-102)*

"కొందరు అల్లాహ్‌ను కాదని ఇతరులను ఆయనకు సమానులుగా, ప్రత్యర్థులుగా భావిస్తారు. వారు అల్లాహ్ పట్ల కలిగి ఉండవలసిన ప్రేమతో వారిని ప్రేమిస్తారు- కాని విశ్వాసులు అన్నిటికంటే అధికంగా అల్లాహ్‌నే ప్రేమిస్తారు - సర్వశక్తులూ, సర్వాధికారాలు అల్లాహ్ గుప్పెట్లో ఉన్నా యని, ఇంకా శిక్షించటంలో కూడా ఆయన చాలా కఠినుడు అనీ ఈ దుర్మార్గులకు మున్ముందు ఘోర శిక్షను ప్రత్యక్షంగా

---

ఆయనతోపాటు ఇతరులను కూడా భాగస్వాములుగా చేస్తున్నారు? వారి వద్ద ఎలాంటి శక్తిసామర్థ్యాలూ లేనప్పుడు భూమ్యాకాశాలలో వారు స్వయంగా నిర్వహించగల పనులే లేనప్పుడు, వారు దేవుళ్ళు ఎలా అవుతారు?

చూపిన తరువాత బోధపడేబదులు, ఇప్పుడే బోధపడితే ఎంత బాగుంటుంది". (బఖర : 165)

ప్రవక్తా (స) వారితో ఇలా అను : "మీరు దేవుణ్ణి త్రోసిరాజని వేడు కుంటున్న శక్తులు అసలు ఏమిటో ఎప్పుడైనా మీరు కళ్ళు తెరచి చూశారా? భూమిలో వారు సృష్టించింది ఏమిటో కొంచెం నాకు చూపండి? లేదా ఆకాశాల సృష్టిలో, వాటి నిర్వహణలో వాటి పాత్ర ఏమైనా ఉందా? ఒకవేళ ఇది వరకు వచ్చిన ఏదైనా గ్రంథంగానీ, లేదా జ్ఞాన అవశేషంగానీ మీ దగ్గర ఉంటే, దాన్నే తీసుకురండి, మీరు సత్య వంతులే అయితే". అల్లాహ్‌ను కాదని ప్రళయం వచ్చే వరకు అతనికి సమాధానమైనా ఇవ్వలేని వారిని మొరపెట్టుకునే వారు తమను మొరపెట్టుకుంటున్నారనే విషయం కూడా ఎరుగని వారిని వేడుకునే వాడికంటే పరమభ్రష్టుడైన మానవుడు ఎవడు ఉంటాడు?[1]

(అహ్‌ఖాఫ్ : 4,5)

"ఒకవేళ ఆకాశంలో, భూమిలో ఒక్క అల్లాహ్ తప్ప ఇతర దేవుళ్ళు కూడా ఉంటే, అప్పుడు (భూమ్యాకాశాల) రెండింటి వ్యవస్థ ఛిన్నా భిన్నమై ఉండేది. కనుక అధికార పీఠానికి ప్రభువైన అల్లాహ్ వారు కల్పించే విషయాలనుండి పరిశుద్ధుడు. ఆయన తాను చేసే పనులకు (ఎవరి ముందూ) జవాబుదారు కాడు. కాని అందరూ (ఆయన ముందు) జవాబుదారులే." (అల్ అంబియా : 22,23)

"అల్లాహ్ ఎవరినీ తన సంతానంగా చేసుకోలేదు మరియు మరొక దేవుడెవ్వడూ ఆయనతోపాటు లేడు. ఒకవేళ అలా అయితే, ప్రతి దేవుడు తన సృష్టిని తీసుకుని వేరుపడిపోయేవాడు; తరువాత వారు

---

1. *అనగా అతని అభ్యర్థనకు సమాధానంగా వారి నుండి ఎలాంటి ప్రతిస్పందనా ఉండదు అని అర్థం.*

ఒకరిపై ఒకరు దండయాత్రలు చేసి ఉండేవారు."

(అల్ మోమినూన్ : 91)

"ప్రవక్తా! వారితో ఇలా అను: ఒకవేళ అల్లాహ్‌తోపాటు వారు అనే విధంగా ఇతర దేవుళ్ళు కూడా ఉంటే వారు సింహాసనాధీశుని స్థానానికి చేరే ప్రయత్నాన్ని తప్పకుండా చేస్తారు. ఆయన పరిశుద్ధుడు. వారు చెప్పే మాటలకు ఎంతో అతీతుడు, ఎంతో ఉన్నతుడు.

*(బనీ ఇస్రాయీల్ : 42-43)*

పై వాక్యాలను మొదటి నుంచి చివరి వరకు పరిశీలిస్తే లభించే మూల విషయం ఒక్కటే. అదేమిటంటే, దైవత్వం, అధికారం ఈ రెండూ ఒకదానితో మరొకటి ముడిపడి వున్నాయి. వాస్తవానికి ఈ రెంటి భావం, అర్థం కూడా ఒక్కటే. ఎవరయితే అధికారాన్ని కలిగి ఉండడో ఆయన దేవుడు కాలేడు అంటే అధికారం, ఆధిపత్యం కలవాడే దేవుడు కాగలడు. ఎందుకంటే, ఏ అవసరాలు తీర్చగలడని భావించి మీరు వేడుకుంటున్నారో ఆయనకు వాటిపై పూర్తి అధికారం, ఆధిపత్యం లేనిదే మీ అవసరాలు తీర్చడం సాధ్యం కాదు కనుక. అధికారంలేనివాడు దేవుడు కావడమన్నది కూడా వాస్తవానికి విరుద్ధమవుతుంది. అలాంటి వారిని అనగా అధికారం లేని వారిని దైవంగా భావించి వేడుకోవడం వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు.

ఈ మూల విషయం ఆధారంగానే ఖుర్‌ఆన్ వివరణను, దాని వాదనను మరియు ఫలితాలను ఒకదాని తరువాత ఒకటి వరుసగా ఈ క్రింది వివరణలతో ఇంకా బాగా అర్థం చేసుకోవచ్చు.

1) అవసరాలను తీర్చడం, ఆపద్బాంధవుడవ్వడం, శరణు కల్పించటం, కనిపెట్టుకుని వుండటం, సంరక్షించటం మరియు సహాయపడటం అనే భావనలు వేటినయితే మీరు సామాన్యమైన విషయాలుగా భావిస్తున్నారో, వాస్తవానికి ఇవన్నీ సామాన్యమైన విషయాలు కావు, వీటి సంబంధం ఈ

విశ్వవ్యవస్థతో, దానిని ఉనికిలోకి తెచ్చి ఎంతో పకడ్బందీగా నడుపుతున్న శక్తితో ముడిపడి ఉన్నాయి. ఈ విశ్వవ్యవస్థలో మీ చిన్న చిన్న అవసరాలు ఎలా తీరుతున్నాయో ఒకసారి పరిశీలించండి. ఈ బ్రహ్మాండమైన విశ్వకర్మాగారంలోని అనేక వస్తువులు ఒకదానితో ఒకటి కలిసి ఎంతో సమన్వయంతో అద్భుతంగా పని చేస్తే కాని మీ చిన్న అవసరం తీరదు. ఉదాహరణకు : మీరు త్రాగే నీరు లేదా మీరు తినే చిన్న గోధమ గింజ లేదా బియ్యపు గింజ మీ వరకు చేరటానికి గాలి, నీరు, భూమి, సూర్యుడు ఒకదానితో ఒకటి కలిసి ఎంతో సమన్వయంతో ఎంతగా శ్రమిస్తున్నాయో ఆ దైవానికే తెలుసు. అలాగే మీ వేడుకోళ్ళు (దుఆలు) విని, మీ అవసరాలు తీర్చడానికి మామూలు శక్తి సామర్థ్యాలు సరిపోవు. దానికై ఈ భూమ్యాకాశాలను సృష్టించడానికి కావలసినంత శక్తిసామర్థ్యాలు అవసరం.

2. ఈ అధికారం విభజింపవీలు లేనటువంటిది. సృష్టిలోని జీవరాశులను సృష్టించే అధికారం ఒకరి దగ్గర, వాటికి ఆహారం సమకూర్చే అధికారం మరొకరి దగ్గర ఉండటమన్నది సరైనది కాదు. అలాగే సూర్యుడు ఒకరి అధీనంలో, భూమి మరొకరి ఆధీనంలోనా? పుట్టించే అధికారం ఒకరి చేతిలో, జబ్బులు, స్వస్థత చేకూర్చే అధికారం మరొకరి ఆధీనంలో ఉండటం సమంజసం కాదు. అలాగే చావు బ్రతుకులు మరొకరి అధీనంలో ఉంటే ఈ విశ్వ వ్యవస్థ ఇంత పకడ్బందీగా దాని మనుగడ సాగించబడడమన్నది సాధ్య మయ్యే పని కాదు. కనుక ఈ అధికారాన్నీ ఒకే ఒక్కరి ఆధీనంలోనే ఉండ వలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ విశ్వ వ్యవస్థ నిర్వహణ కోరేది కూడా ఇదే. వాస్తవానికి ఈ వ్యవస్థ నడుస్తుంది కూడా ఇలాగే.

3. ఈ సృష్టిలోని సకల అధికారాలు ఒకే దేవుని ఆధీనంలో ఉన్నప్పుడు, ఆయన అధికారంలో ఎవరికీ రవ్వంత అయినా భాగస్వామ్యం లేనప్పుడు, దైవత్వం కూడా ఆసాంతం ఆయన ఒక్కడికే ప్రత్యేకించబడాలి. అందులో ఎవరికీ ఎటు వంటి భాగస్వామ్యం ఉండరాదు. మీ తరఫున సిఫారసు చేయ

గల, మీ వేడుకోలు మన్నింపుజేయగల, మీకు శరణు కల్పించగల, మీ సన్నిహిత సంర క్షకుడు కాగల, మీకు లాభనష్టాలు కలిగించగల శక్తిసామర్థ్యాలుగల వారని భావించి ఎవరినయితే మీరు దేవుళ్ళుగా భావిస్తున్నారో అలాంటి దేవుళ్లు ఎవరూ లేనేలేరు. ఆయన సృష్టిలో ఆయన అనుజ్ఞ లేనిదే కనురెప్ప కూడా కదిలించే శక్తిసామర్థ్యం ఎవరికీలేదు. ఇంకా ఆయన సృష్టి వ్యవహారాలలో ఎవరూ ఎటువంటి జోక్యం కూడా చేసుకోలేరు. ఇంకా సిఫారసు అంగీకరించే లేక రద్దు పరిచే అధికారం కేవలం ఆయన ఒక్కడికి మాత్రమే ఉన్నది. బలవంతంగా తమ సిఫారసును అంగీకరింప జేయగల శక్తిసామర్థ్యాలు కూడా ఎవరి వద్దా లేవు.

4) ఒక్కడైన సర్వాధికారాల స్వామి ఔన్నత్యం ఏమిటంటే, శాసనాధికార లేదా ఆజ్ఞాధికారాల ఎన్ని రూపాలయితే ఉన్నాయో అవన్నీ సర్వసత్తాక ప్రభువులోనే నిగూఢమై ఉండాలి. అధికారాల్లోని ఏ విభాగం కూడా బదిలీ కారాదు.

సృష్టికర్త ఆయనే అయినప్పుడు ఆయన సృష్టిలో ఎవరూ భాగస్వాములుగా ఉండరాదు. పోషించేవాడు ఆయన అయినప్పుడు పరిపోషణలో ఎవరినీ ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టరాదు. సర్వసృష్టికి పరివేక్షకుడు ఆయనయితే ఈ పరివేక్షణలో ఎవరూ ఆయనకు సహవర్తులు కారు. కనుక సర్వాధికారాలకు స్వామి, శాసన ప్రదాత, దర్శకుడు కూడా ఆయనే అయి వుండాలి. ఆయన సర్వసత్తాక అధికారంలో ఎవరికీ భాగస్వామ్యం కల్పించ రాదు. ఎలాగయితే ఆయన సామ్రాజ్యంలో ఆయన తప్ప వేరితరులు కార్యసాధకులుగా, అవసరాలను తీర్చేవారుగా, ఆపద్బాంధవులుగా ఉండటం సరికాదో, అలాగే వేరొకరు స్వతహాగా ఆజ్ఞలిచ్చే లేక దేన్నయినా నిషేధించేవాడిగా, శాసనప్రదాతగా ఉంచటం కూడా సరికాదు. సృష్టించటం, పోషించటం, సూర్య చంద్రులు లోబడి ఉండటం, రాత్రింబవళ్ళ భ్రమణం, అదృష్టదురదృష్టాలు,

శాసనాధికారం, మార్గనిర్దేశనం– ఇవన్నీ తిరుగులేని ఏకసత్తాక రాజ్యాధి కారంలో వివిధ రూపాలు. ఈ అధికారం, ఆధిపత్యం విభజించడానికి వీలు లేనిది. ఒకవేళ ఎవరైనా ఏ ఆధారమూ లేకుండా అల్లాహ్ ఆజ్ఞలకు, నియమా లకు బదులుగా మరెవరి ఆజ్ఞలకైనా విధేయత చూపితే వారు అల్లాహ్‌కు సాటికల్పించే అనగా షిర్క్ చేసే వారితో సమానం. ఒకవేళ ఎవరైనా రాజకీ యంగా ఈ విశ్వవ్యవస్థకు యజమానిగా లేక సార్వభౌమునిగా స్వతఃసిద్ధంగా ఆజ్ఞలిచ్చే శక్తిగల వారిగా ప్రకటించుకుంటే వారు కూడా దేవుని దైవత్వంలో భాగస్వాములుగా ప్రకటించినట్లే. తమను సర్వసత్తాక ప్రభువుగా భావించి, మీ సంరక్షకుడ్ని, సహాయకుడ్ని, మిమ్మల్ని రక్షించగల వాడిని" అని అనే వారితో సమానం. అందుకే ఎక్కడయితే సృష్టించడం, అదృష్టాన్ని నిర్ణయిం చడం, సృష్టి వ్యవహారాలో దైవానికి భాగస్వాములు ఎవరూ లేరని చెప్పడం జరిగిందో అక్కడే **"లహుల్ హుకుమ్, వలహుల్ ముల్క్ మరియు లమ్‌యల్లహు షరీకుమ్ ఫిల్ ముల్కి"** అని కూడా చెప్పడం జరిగింది.

దేవుని దైవత్వంలో రాచరికం, పరిపాలనాధికారం కూడా మిళితమై ఉన్నాయనడానికి ప్రబల నిదర్శనం. నిజమేమిటంటే, ఈ భావన ప్రకారం, దేవుని ఏకత్వంలో అల్లాహ్‌కు తోడుగా మరెవరూ భాగస్వాములు లేరు అని గ్రహించాలి. దీన్నే ఇంకా స్పష్టంగా ఈ క్రింది వాక్యాలలో వివరించడం జరిగింది.

> ఇలా అను : "ఓ అల్లాహ్, విశ్వ సామ్రాజ్యాధిపత్యానికి ప్రభూ! నీవు కోరిన వారికి ప్రభుత్వాధికారాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారి నుండి దాన్ని లాక్కుంటావు. నీవు కోరిన వారికి గౌరవాన్ని ప్రసాది స్తావు. నీవు కోరిన వారిని పరాభవంపాలు చేస్తావు. శుభాలు నీ అధీనంలో ఉన్నాయి". *(ఆలి ఇమ్రాన్ : 26)*

"కనుక అల్లాహ్ మహోన్నతుడు, నిజమైన చక్రవర్తి, ఆయన తప్ప మరొక దేవుడు లేనేలేడు. గౌరవ పీఠానికి స్వామి".

*(అల్ మూమినూన్ : 116)*

ఇలా అను: "నేను మానవుల ప్రభువు, మానవుల చక్రవర్తి, మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్) శరణు కోరుతున్నాను".

*(అన్నాస్ : 1-3)*

ఏ రోజునయితే పరదాలు తొలగిపోయి అందరూ బయటకు వచ్చిన రోజున వారికి సంబంధించిన విషయమేదీ అల్లాహ్‌కు రహస్యంగా ఉండదు. (ఆ రోజున ఇలా అడగటం జరుగుతుంది.) "ఈనాడు విశ్వ సామ్రాజ్యాధికారం ఎవరిది?" అని. (విశ్వం మొత్తం ముక్తకంఠంతో ఇలా అంటుంది), 'ఇది ఒకే దేవుడూ సర్వాధిక్యం గలవాడూ అయిన అల్లాహ్‌ది" అని. *(అల్ మూమిన్:16)*

ఇమామ్ అహ్మద్ పొందుపరిచిన హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రఅ) ఉల్లేఖించిన ఒక ప్రవచనం (హదీసు)లో దీనిగురించిన అత్యుత్తమ తాత్పర్యం ఉంది. ప్రవక్త ముహమ్మద్ (స) గారు ఒకసారి ప్రసంగం చేస్తూ, "అల్లాహ్ భూమ్యా కాశాలను తన గుప్పిట పట్టుకుని, నేనే ఈ విశ్వసామ్రాట్టుని. నేనే పరాక్రమశాలిని, నేనే సర్వాధిపతిని. భూమిపై మేమే ప్రభువులమని విర్రవీగిన వారు ఎక్కడా? ఎక్కడున్నారు పొగరుబోతులు? ఎటువెళ్ళారు పరాక్రమ శాలురు? ఏమైంది వారి అధికారం? అని ప్రశ్నిస్తాడు". ఈ ప్రవచనాన్ని ఉల్లేఖించిన అబ్దుల్లా బిన్ ఉమర్ (ర) ఆ సమయంలో ప్రవక్త (స) గారి పరిస్థితిని వివరిస్తూ, "ఈ మాటలు చెబుతున్నప్పుడు ప్రవక్త (స) ఉద్వేగంతో ఊగిపోతున్న దృశ్యాన్ని చూసి మెంబరు (వేదిక) నుండి ఎక్కడ క్రింద పడిపోతారో అనేంతగా మాకు భయం కలిగింది" అని తెలిపారు.

# రబ్ (ప్రభువు)

**నిఘంటు అర్థ పరిశోధన :** ఈ పదం ర,బ,బ అనే అక్షరాల కలయికతో ఏర్పడింది. దీని మూలార్థం పోషించుట. దీని నుండే వినియోగించటం, కనిపెట్టు కొని ఉండటం, బాగోగులు చూడటం, పరిపూర్తిగావించటం అనే అర్థాలు కూడా ఉత్పన్నమవుతాయి. దీన్ని ఆధారంగా చేసుకొని ఆధికృత, నిర్వహణ, యాజమాన్యం అనే భావంలో కూడా ప్రభువు అనే పదానికి వాడు తారు. నిఘంటువు ఆధారంగా కొన్ని ఉదాహరణలతో వీటి వివరణ ఇలా ఉంది.

1) దీని మొదటి భావం, పోషించటం, పెంచటం, సాకటం, తీర్చి దిద్దటం. ఉదాహరణకు, మారు తండ్రి ఇంట పోషించబడుతున్న అబ్బాయిని 'రబీబ్' అని, అమ్మాయిని 'రబీబహ్' అని అంటారు. అలాగే పిల్లలను పోషించే ఆయాను కూడా 'రబీబహ్' అని అంటారు. సవతి తల్లిని 'రాబ్బహ్' అని అంటారు. ఎందుకంటే ఆమె స్వంత తల్లి కాకపోయినా ఆ పిల్లవాణ్ణి పెంచుతుంది కనుక. దీని ఆధారంగానే 'రాబ్బ్' అని మారు తండ్రిని అంటారు. భద్రపరచబడినదానిని 'మురబ్బిబ్' లేదా 'మురబ్బి' అని అంటారు. 'రబ్బ, యరుబ్బు, రబ్బున్' అనగా అధికం చేయటం, వికసింపజేయటం, పరిపక్వతకు చేర్చటం అని అర్థం. 'రబ్బున్నీము' అంటే ఇతోధికంగా మేలు చేశాడు, ఉపకారం చేయటంలో సాటిలేని మేటి అని అర్థం.

2) రెండవ అర్థం ప్రోగుచేయటం, కూడబెట్టటం, సమకూర్చటం.

ఉదాహరణకు, 'ఫలాన్ బిరబ్బిన్నాసి' అనగా ఫలానా వ్యక్తి జనాన్ని సమీకరిస్తున్నాడు లేదా అందరూ ఆయన చుట్టూ గుమిగూడుతున్నారని అర్థం. సమీకరించబడే స్థలాన్ని 'మరబ్బు' అని, ప్రోగుచేయటానికి లేక సమకూర్చబడటాన్ని 'తరబ్బుబ్' అని అంటారు.

3) మూడవ అర్థం, కనిపెట్టుకొని ఉండటం, పరిస్థితులను చక్కదిద్దటం, బాగోగులు చూచుట, సంరక్షించటం. ఉదాహరణకు, 'రబ్బుజయ్ అతిహి' అనగా ఫలానా వ్యక్తి తన ఆస్తిపాస్తులను కనిపెట్టుకొని ఉన్నాడు అని అర్థం.

అబూ సుఫ్యాన్‌తో సఫ్వాన్ ఇలా అన్నాడు : "హవాజిన్ తెగకు చెందిన వ్యక్తి నా సంరక్షకుడు కావడంకన్నా ఖురేషీ తెగలోని వారు ఎవరయినా నన్ను తన సంరక్షణలో తీసుకుంటే నాకు చాలా ఆనందం కలుగుతుంది".

అల్ఖమ బిన్ ఉబైదా అరబ్బిలో చెప్పిన కవితకు భావం ఇది–

"నీకంటే ముందు ధనవంతులెవరయితే నా 'మురబ్బి' (సంరక్షకులు)గా ఉన్నారో వారు నా బాగోగులు, పట్టించుకోలేదు. ఎట్టకేలకు నా సంరక్షణా బాధ్యత నీపై పడింది."

ఉదాహరణకు ఫర్‌జదిఖ్ ఒక కవితలో ఇలా అన్నాడు : కానూ కసాయిలతిన్ హుమఖాయి ఇజా హఖినత్ సలావుహా ఫీ అదీమెన్ గైరు మర్‌బూచి

'అదీమెన్ గైరు మర్‌బూచి అంటే కష్టపడి సంపాదించని. ఇంకా పరిశుభ్రపరచబడని చర్మం అని అర్థం. ఇంకా ఫలానా వ్యక్తి మరొకరి వద్ద తన వృత్తి, పనిని నిర్వహిస్తున్నాడు. లేదా ఆయన ద్వారా వృత్తి నైపుణ్యాన్ని పెంచుకుంటున్నాడు.

4) నాలుగవ అర్థం, ఆధిక్యత, సర్వోన్నతమైన, నేతృత్వం, ఆజ్ఞాపించటం, అధికారాన్ని ఉపయోగించటం. ఉదాహరణకు, 'ఖద్‌రబ్బ ఫిలానున్ ఖౌమహు' అనగా ఫలానా వ్యక్తి తన వర్గం వారిని తన అదుపులో ఉంచుకున్నాడు. 'రబబ్‌తుల్ ఖౌమ' అనగా నేను నా వర్గం వారిపై హుకుమ్ (పెత్తనం) చెలాయించి గొప్ప వాడినయ్యాను.

లబీద్ బిన్ రబీయ ఇలా అంటున్నాడు: వహలకుమ్ యౌమ రబ్, వబ్‌నహు వరబ్ మాద్ బిన్ ఖస్త్ వఅర్ అర్. ఇక్కడ 'రబ్బుకుంద' అనగా ఎవరి శాసనమైతే ఆ వర్గంలో నడుస్తుందో ఆ వర్గం పెద్దమనిషి.

5) ఐదవ అర్థం, యజమాని కావడం. ఉదాహరణకు, ఒక ప్రవచనం (హదీసు)లో ఒక వ్యక్తిని ప్రవక్త(స) ఇలా ప్రశ్నించారు : "అరబ్బు ఘనమిన్ అమ్‌రబ్బు ఇబిల్?"(నీవు మేకల యజమానివా? లేక ఒంటెల యజమానివా?) ఇదే భావంతో ఇంటి యజమానిని 'రబ్బుద్దార్' అంటారు. ఒంటె యజమాని 'రబ్బున్నాఖతి' అని, ఆస్తి యజమానిని 'రబ్బుజయ్ అతిహి' అని పిలుస్తారు. అలాగే 'రబ్' అనే పదాన్ని స్వామి అనే అర్థంలో కూడా వాడుతారు. అలాగే బానిసకు పర్యాయపదంగా 'అబ్ద్' అనే పదాన్ని వాడుతారు. పొరపాటున ప్రభువు (రబ్) అనే పదాన్ని కేవలం పాలకుడు, పోషకుడు అనే భావనకే పరిమితం చేశారు. అలాగే 'రుబూబియత్'కు నిర్వచనంగా దేన్నయినా అంచెలంచెలుగా అభివృద్ధి చేసి పరిపూర్తిగావించటం అన్న భావనకే పరిమితం చేసి వేశారు. వాస్తవానికి రబ్ (ప్రభువు) అన్న పదానికి వున్న విస్తృతభావాలలో ఇది ఒక భావన మాత్రమే. దాని పూర్తి భావాల విస్తార పరిధిని పరిశోధన చేయడం ద్వారా ప్రభువు (రబ్) అన్న పదములో ఈ క్రింది భావాలు ఇమిడి ఉన్నాయని తెలుస్తుంది.

I. పోషించేవాడు, అవసరాలను తీర్చేవాడు. ఒక క్రమపద్ధతిలో తీర్చిదిద్దుతూ పెంచేవాడు.

II. యజమాని, కనిపెట్టి ఉండేవాడు, బాగోగులు చూసేవాడు, పర్యవేక్షకుడు.

III. ఎవరి వైపునకైతే అందరూ సమీకరించబడతారో అలాంటి సర్వసత్తాక సామర్థ్యం కలవాడు.

IV. సర్వాన్ని నియంత్రించగలవాడు, సర్వాధికారాలకు స్వామి, ఆజ్ఞాపించే వాడు. సర్వసత్తాక ప్రభువుగా ఎవరి శాసనమైతే నడుస్తుందో అలాంటి అధికారం గలవాడు.

V. స్వామి, యజమాని.

## ఖుర్‌ఆన్‌లో వాడబడిన 'ప్రభువు' అనే పదభావం

ఖుర్‌ఆన్‌లో ప్రభువు అన్న పదాన్ని పై అన్ని భావాలలో వాడటం జరిగింది. కొన్ని చోట్ల ఒకటి లేక రెండు భావాలలో ప్రయోగించబడితే, మరికొన్ని చోట్ల అంతకంటే ఎక్కువ భావాలలో, ఇంకొన్ని చోట్ల పై అయిదు భావాలు ఇందులో కూడా ఇమిడి ఉన్నాయి. ఈ విషయాన్నే మనం ఖుర్‌ఆన్ వాక్యాలలో అనేక ఉదాహరణ లతో స్పష్టంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

## మొదటి అర్థంలో...

యూసుఫ్(అలై) ఇలా అన్నాడు. "నేను అల్లాహ్ శరణు వేడుకుంటు న్నాను. నా ప్రభువు[1] నాకు మంచి స్థానం ప్రసాదించాడు". (యూసుఫ్ : 23)

## రెండవ అర్థంలో...

ఇందులో మొదటి అర్థం కూడా దాదాపుగా కలిసి ఉంది.

---

1. *ఇక్కడ 'ప్రభువు' అని యూసుఫ్(అలై) ఈజిప్టు చక్రవర్తి అజీజ్‌ను ఉద్దేశించి అన్నాడని పొరపాటున కొందరు వ్యాఖ్యాతలు, పండితులు భావించారు. వాస్తవానికి ఇక్కడ 'ప్రభువు' అని సంబోధించింది అల్లాహ్‌ను. కాపాడే అల్లాహ్ అతి సమీపంలో ఉన్నప్పుడు మరొకరి శరణు ఎలా కోరవలసిన అవసరం ఏముంటుంది?*

"మీరు పూజిస్తున్న వారంతా నాకు శత్రువులే ఒక్క సకల లోకాల ప్రభువు తప్ప. ఆయన నన్ను సృష్టించాడు. ఆయనే నాకు మార్గం చూపుతు న్నాడు. ఆయనే నాకు తినిపిస్తాడు, త్రాగిస్తాడు. నేను వ్యాధికి గురై నప్పుడు స్వస్థత చేకూర్చేవాడు కూడా ఆయనే"

*(అష్ షుఅరా : 77-80)*

మీకు లభించిన అనుగ్రహం ఏదైనా అది అల్లాహ్ తరఫు నుండే లభించింది. మీకేదైనా గడ్డుకాలం దాపురించినప్పుడు మీరు మీ మొర లతో ఆయన వైపునకే పరుగెడతారు. కాని అల్లాహ్ ఆ గడ్డుకాలాన్ని తొలగించినప్పుడు (ఈ కనికరానికి కృతజ్ఞతగా) మీలో ఒక వర్గం ఒక్కసారిగా తన ప్రభువునకు ఇతరులను భాగస్వాములుగా చెయ్యటం ప్రారంభిస్తుంది. *(అన్ నహ్లా : 53,54)*

"నేను అల్లాహ్‌ను కాదని వేరే ప్రభువును అన్వేషించాలా, ఆయనే ప్రతి దానికి ప్రభువైనప్పుడు?" *(అన్‌ఆమ్ : 164)*

"ఆయన తూర్పు పడమరలకు స్వామి, ఆయన తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు ఆయననే వకీలుగా, కార్యసాధకునిగా చేసుకో."

*(ముజ్జమ్మిల్ : 9)*

## మూడవ అర్థంలో...

"ఆయనే మీ ప్రభువు, ఆయన వైపునకే మీరు మరలవలసి ఉన్నది."

*(హూద్: 34)*

"చివరకు మీరంతా మీ ప్రభువు వైపునకే మరలిపోవలసి ఉన్నది".

*(జుమర్ :7)*

"ఇలా అను, మన ప్రభువు మనల్ని సమావేశపరుస్తాడు". *(సబా : 26)*

"భూమిపై సంచరించే ఏ జంతువునైనా, గాలిలో రెక్కలతో ఎగిరే ఏ పక్షినైనా చూడండి. ఇవన్నీ మీ వంటి జీవరాశులే. వాటి విధివ్రాత ఉన్న గ్రంథంలో మేము ఏ కొరతా చెయ్యలేదు. తరువాత ఇవన్నీ తమ ప్రభువు వద్ద ప్రోగు చెయ్యబడేవే". *(అన్‌ఆమ్ : 38)*

"ఆ తరువాత ఒక శంఖం ఊదబడుతుంది. అప్పుడు వారు హఠాత్తుగా తమ ప్రభువు ముందు హాజరయ్యేందుకు తమ సమాధుల నుండి బయటికి వస్తారు." *(యాసీన్ : 51)*

## నాలుగవ అర్థంలో...

ఇందులో కాస్తోకూస్తో మూడవ అర్థం కూడా కలిసి ఉంది.

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, సన్యాసులను తమ ప్రభువుగా చేసుకున్నారు". *(తౌబా : 31)*

"మనలోని వారెవ్వరూ అల్లాహ్‌ను తప్ప మరెవరినీ తమ ప్రభువుగా చేసుకోరాదు". *(ఆలి ఇమ్రాన్ : 64)*

పై రెండు వాక్యాలలో ప్రభువులు (అర్‌బాబ్) అంటే ఆయా జాతుల వారు లేదా వర్గాలవారు వారిని తమ మార్గదర్శకులుగా, తమ సంరక్షకులుగా శిరసావహించారని అర్థం. వెనుకాముందు ఆలోచించకుండా వారి ఆజ్ఞలను మరియు శాసనాలను తమకు శిరోధార్యమని భావించేవారు, వారు ధర్మ సమ్మతం (హలాల్)గా నిర్ధారించిన దానిని ధర్మంగా, వారు నిషిద్ధం (హరామ్)గా ఖరారు చేసినదానిని నిషిద్ధంగా అంగీకరించేవాడు వారిని ఆజ్ఞాపించే లేదా దేనినైనా రద్దుచేసే అధికారం గలవారిగా భావించేవారు.

"మీలో ఒకడు తన 'ప్రభువు'నకు (ఇక్కడ ప్రభువు అంటే ఈజిప్టు రాజు అని అర్థం), తాగటానికై మధువును (సారాయిని) అందిస్తాడు. (యూసుఫ్– 41)

"వారిలో విడుదల అవుతాడని తాను భావించిన వానితో యూసుఫ్ (అలై) ఇలా అన్నాడు. 'నీ ప్రభువు (ఈజిప్టు రాజు) దగ్గర నా ప్రస్తావన చెయ్యి.' కాని షైతాన్ అతనిని మరపునకు లోను చేశాడు. అతడు తన ప్రభువు (రాజు) దగ్గర అతనిని గురించి ప్రస్తావించటం మరచిపోయాడు. *(యూసుఫ్ : 42)*

రాజదూత యూసుఫ్(అలై) వద్దకు తిరిగి వెళ్ళినప్పుడు, యూసుఫ్(అలై) ఇలా అన్నాడు: "నీ ప్రభువు వద్దకు తిరిగి వెళ్ళు, తన చేతులను కోసుకున్న నారీమణుల వ్యవహారం గురించి అతనిని అడుగు? నా ప్రభువుకు వారి జిత్తులను గురించి బాగానే తెలుసు".

*(యూసుఫ్ : 50)*

ఈ వాక్యాలలో హజ్రత్ యూసుఫ్(అలై) ఈజిప్టు వాసులతో మాటి మాటికీ ఈజిప్టు రాజును వారి **ప్రభువు**గా సంబోధించారు. ఎందుకంటే వారు ఆయననే నిరపేక్ష ప్రభువుగా, సర్వాధికారాలకు స్వామిగా, తమ బాగోగులు చూసే యజమానిగా భావిస్తూ ఉండేవారు. అందువల్ల వారి దృష్టిలో అతనే **'ప్రభువు'** కాగా, యూసుఫ్(అలై) మాత్రం అల్లాహ్‌యే తన 'ప్రభువ'ని చాటారు. ఎందుకంటే ఆయన సర్వాధికారాలకు స్వామి, పరిపోషకుడు, పరిరక్షకుడుగా అల్లాహ్‌నే పరిగణించేవారు గాని ఈజిప్టు చక్రవర్తిని మాత్రం కాదు.

## ఇక ఐదవ అర్థంలో...

"కనుక వారు ఈ (కాబా) గృహం ప్రభువును ఆరాధించాలి. ఆయన వారికి ఆహారమిచ్చి ఆకలి బాధనుండి కాపాడాడు, శాంతిని ప్రసాదించి భయం నుండి రక్షించాడు". *(ఖురైష్ : 3-4)*

"నీ ప్రభువు పరిశుద్ధుడు, గొప్ప గౌరవోన్నతులు కలవాడు. వారు

కల్పిస్తున్న అన్ని విషయాలకూ అతీతుడు. అందరూ ఆయన వైపునకే మరలవలసి ఉన్నది". *(సాప్ఫాత్ : 180)*

"అధికార పీఠానికి ప్రభువైన అల్లాహ్ వారు ఆపాదించే విషయాల నుండి పరిశుద్ధుడు". *(అంబియా : 22)*

వారిని ఇలా అడుగు, "సప్తాకాశాలకు, మహోన్నతమైన పీఠానికి ప్రభువు ఎవరు?" *(మూ'మినూన్ : 86)*

"ఆయన భూమికీ, ఆకాశాలకూ, భూమ్యాకాశాలలో ఉన్న సమస్తానికీ ప్రభువు, తూర్పుదిక్కులన్నింటికీ ప్రభువు". *(సాఫ్ఫాత్ : 5)*

ఆయనే సిరియస్ (అగ్ని నక్షత్రం) నక్షత్రానికి కూడా ప్రభువు". *(నజ్మ్ : 49)*

## పరిపోషకత్వం (రుబూబియత్) విషయంలో మార్గవిహీన జాతుల భావనలు

పై వాక్యాల వివరణతో 'ప్రభువు' (రబ్) అన్న పదానికి భావం పూర్తిగా అర్థమై ఉండాలి. ఇప్పుడు నేను పరిపోషణ (రుబూబియత్) విషయంలో అజ్ఞానకాలపు జాతులలో ప్రబలివున్న భావాలు, భావనలేమిటి? ఖుర్ఆన్ ఏఏ భావనలను త్రోసిపుచ్చుతుంది? ఇంకా ఖుర్ఆన్ ఏ విషయం వైపు మనల్ని ఆహ్వానిస్తుందో ఆ విషయాలను వివరిం చదలిచాను. ఈ విషయంలో ఏ అజ్ఞాన జాతుల ప్రస్తావనయితే ఖుర్ఆన్ చేసిందో వారిని వేరువేరుగా తీసుకొని వారి భావాలను గురించి చర్చిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. దీనివల్ల అసలు విషయాన్ని పూర్తిగా విడమర్చి తెలుసు కోవచ్చు.

## నూహ్ (అలై) జాతి వారు

అన్నింటికన్నా ముందు ఖుర్ఆన్‌లో చర్చించబడ్డ జాతి నూహ్(అలై)

జాతి. ఈ జాతి వారు అల్లాహ్ గురించి తెలియనివారేమీ కాదని ఖుర్ఆన్ ద్వారా స్పష్టంగా తెలుస్తుంది. హజ్రత్ నూహ్(అలై) గారి సందేశాన్ని విని ఆ జాతివారు వ్యక్తపరచిన భావాన్ని స్వయంగా ఖుర్ఆనే ఇలా నకలు చేసింది.

ఈ వ్యక్తి మీవంటి ఒక మానవుడే తప్ప మరేమీకాడు. మీపై ఆధిక్యత సాధించటం ఇతని అభిమతం. అల్లాహ్ గనుక పంపదలిస్తే దైవదూతలను పంపి ఉండేవాడు". *(అల్ మూ'మినూన్ : 24)*

దీన్నిబట్టి వారు అల్లాహ్‌యే యజమాని కావడానికి, మొదటి, రెండవ అర్థాల ప్రకారం, అల్లాహ్‌నే నిజప్రభువుగా అంగీకరించడానికి కూడా వెనుకాడలేదని అర్థమవుతుంది. అప్పుడు నూహ్(అలై)వారితో ఇలా అంటున్నారు.

"ఆయనే మీ ప్రభువు. ఆయన వైపునకే మీరు మరలవలసి ఉన్నది".
*(హూద్ -34)*

"మీరు మీ ప్రభువును క్షమించమని వేడుకోండి. నిస్సందేహంగా ఆయన గొప్ప క్షమావంతుడు". *(నూహ్- 10)*

అల్లాహ్ ఏ విధంగా ఏడు ఆకాశాలను ఒకదానిపై ఒకటి సృష్టించాడో, వాటిలో చంద్రుణ్ణి కాంతిగానూ, సూర్యుణ్ణి దీపంగానూ చేశాడో, మీరు చూడడం లేదా? అల్లాహ్ మిమ్మల్ని భూమి నుండి మొలిపించాడు.
*(నూహ్ : 15-17)*

ఇక్కడ ఎవరు కూడా అల్లాహ్ మా ప్రభువు కాదనిగానీ, లేదా ఈ భూమ్యాకాశాలను, ఇంకా మమ్మల్ని సృష్టించినవాడు అల్లాహ్ కాదని గానీ, భూమ్యాకాశాలలో సమస్త ఏర్పాట్లు చేసింది అల్లాహ్ కాదనిగాని అనడంలేదు.

ఇంకా అల్లాహ్‌యే తమ దేవుడు (ఇలాహ్) అన్న విషయంలో కూడా

వారికి ఎలాంటి ఆక్షేపణలేదు. అందుకే హ(జత్ నూహ్(అలై) తన సందేశాన్ని వారి ముందు ఇలా ఉంచారు :

"ఆయన తప్ప మీకు మరో దేవుడు లేదు." *(అల్ఆరాఫ్ : 59)*

ఒకవేళ వారు అల్లాహ్‌నే దేవునిగా అంగీకరించేవారు కాకపోతే నూహ్(అలై) సందేశం ఇలా ఉండేది-

"అల్లాహ్‌ను మీ దేవునిగా చేసుకోండి."

అయితే మరి ఏ విషయంపై వారికి, హ(జత్ నూహ్(అలై)కు మధ్య భేదాభి(పాయాలు వచ్చాయి అన్నదే ఇక్కడ పెద్ద (ప్రశ్న. ఖుర్ఆన్ ద్వారా తెలిసిందేమిటంటే, 'బినా,' 'నిజా' అనే రెండు విషయాలపై వారి మధ్య భేదాభి(పాయాలుండేవి.

మొదటి విషయమేమిటంటే, సర్వలోక (ప్రభువునైతే మీరు, మిమ్మల్ని, ఈ సర్వసృష్టిని ఉనికిలోకి తెచ్చాడని నమ్ముతున్నారో ఆయనే మీ సకల అవస రాలు తీర్చగల స్వామి. హ(జత్ నూహ్(అలై)గారి బోధన. వాస్తవానికి ఒక్కడైన ఆ దేవుడే మీ దేవుడు. ఆయన తప్ప మరో దేవుడు లేదు. ఆయన తప్ప మీ అవసరాలు తీర్చగల మరే శక్తీ లేదు. మిమ్మల్ని కష్టాల నుండి గట్టెక్కించగల వాడు, మీ మొరలను ఆలకించి మీకు సహాయం చేయగల వారెవ్వరూ లేరు. కనుక మీరు ఆయన ముందే సాష్టాంగపడాలి.

"నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేదు... *యదార్థానికి నేను సకల లోక (ప్రభువునకు (ప్రవక్తను. నా (ప్రభువు సందేశాలను మీకు అందజేస్తాను." (ఆరాఫ్ : 59-62)* అని హ(జత్ నూహ్(అలై) బోధించేవారు.

కాని వారు మా(తం అల్లాహ్‌ను సకల లోకాలకు (ప్రభువుగా అంగీక రిస్తూనే ఇతరులకు కూడా దైవత్వంలో కాస్తోకూస్తో భాగస్వామ్యం ఉందని దృఢంగా నమ్మేవారు. తమ అవసరాలు, ఆ భాగస్వాములతో కూడా ముడివడి

ఉన్నాయని నమ్మి అల్లాహ్‌తోపాటు వారిని కూడా దేవుళ్ళుగా భావించి ఆరాధించేవారు.

> "వారి నాయకులు, వారి పెద్ద మనుషులు వారితో ఇలా అన్నారు; 'ప్రజలారా! మీరు మీ ఆరాధ్య దైవాలను ఎంతమాత్రం విడిచిపెట్టకండి. 'వద్దా', సువా'లను విడిచిపెట్టకండి. యగూస్‌ను, యఊఖ్‌ను, నసర్‌ను కూడా విడనాడకండి." (నూహ్ : 23)

రెండవది: వారు అల్లాహ్‌ను ప్రభువుగా నమ్మేవారంటే దాని భావం, ఆయన్ని కేవలం సృష్టికర్తగా, భూమ్యాకాశాల యజమానిగా, గొప్ప ప్రణాళికా రచయితగా మాత్రమే భావించేవారు. కాని నైతిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, తమ జీవితపు సకల రంగాలను శాసించే ప్రభువుగా, శాసన ప్రదాతగా, శాసనకర్తగా, సర్వసత్తాక అధికారాలు గల స్వామిగా ఆయనకే విధేయత చూపటానికి బదులుగా వారి పండితులను, సన్యాసులను, మతపెద్ద లను తమ మార్గదర్శకులుగా చేసుకున్నారు. దేవుని సార్వభౌమత్వాన్ని ముక్క చెక్కలు చేయరాదన్నది హజ్రత్ నూహ్(అలై) బోధ. "సకల భావాలరీత్యా కేవలం అల్లాహ్‌నే పరమ ప్రభువుగా అంగీకరించండి. ఆయన ప్రతినిధిగా ఆయన ఏ ఆదేశాలను, శాసనాలను మీ వరకు నేను చేరవేస్తున్నానో వాటిని అనుస రించండి" అన్నది నూహ్(అలై) వాదన.

> "నేను మీ కొరకు ఒక విశ్వసనీయుడైన సందేశహరుడను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నాకు విధేయత చూపండి."
> *(అష్ షుఅరా : 107,108)*

## ఆద్ (అలై) జాతి వారు

నూహ్(అలై) జాతి వారి తరువాత ఖుర్ఆన్ ప్రస్తావించిన మరో జాతి ఆద్(అలై) జాతి. నూహ్(అలై)జాతి అల్లాహ్ పట్ల ఎటువంటి భావన కలిగి

ఉండేదో అలాంటి భావననే ఆద్(అలై) జాతి కూడా కలిగి ఉండేది. నూహ్(అలై) జాతిలో పైన ఉదాహరించబడిన ఆ రెండు కారణాలే ఆద్ (అలై) జాతిలో ఉండేవి. వరుస క్రమంలో ఖుర్ఆన్ వాటి వివరణ ఈ క్రింది విధంగా పేర్కొన్నది.

> ఇంకా ఆద్ జాతి వద్దకు మేము వారి సోదరుడు హూద్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు : " నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు.... దానికి సమాధానంగా వారు ఇలా అన్నారు: ఏమిటి, మేము ఒక్క అల్లాహ్‌నే ఆరాధించాలా? మా తాతముత్తాతలు పూజిస్తూ వచ్చిన వాటిని వదిలివేయాలా? ఇది చెప్పటానికేనా నీవు మా వద్దకు వచ్చింది!?"
>
> *(ఆరాఫ్ : 65-70)*
>
> వారు ఇలా అన్నారు; 'మా ప్రభువు తలచుకుంటే దైవదూతలను పంపి ఉండేవాడు". *(హా, మీమ్ అస్‌సజ్‌దహ్: 14)*
>
> "వీరే ఆద్ జాతి వారు, వారు తమ ప్రభువు ఆయతులను తిరస్కరించారు. ఆయన పంపిన ప్రవక్తల మాటలను వారు పాటించలేదు. అధికారం గల నిరంకుశుడైన ప్రతి సత్యవిరోధికి విధేయత చూపారు".
>
> *(హూద్ : 59)*

## సమూద్ జాతి వారు

ఆద్(అలై) జాతి తరువాత తలబిరుసుతనం ప్రదర్శించిన మరో పెద్ద జాతి సమూద్ జాతి. పైన పేర్కొన్న నూహ్, ఆద్ జాతిలాంటి మార్గభ్రష్టతకే సమూద్ జాతి కూడా గుర్తై ఉండేది. వారికి అల్లాహ్ ఉనికిపట్ల, ఆయన దైవత్వం, పోషకత్వం పట్ల ఆక్షేపణ ఉండేదికాదు. ఆయననే ఆరాధించాలి అన్న విషయంతో కూడా విభేదించేవారు కాదు. కాని అల్లాహ్ మాత్రమే దేవుడు. ఆయనను తప్ప మరెవరినీ ఆరాధించరాదు, అన్ని విధాలా దైవత్వాన్ని కేవలం

అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోవాలన్న విషయాన్ని మాత్రం అంగీకరించేవారు కాదు. వారు అల్లాహ్‌తో పాటు ఇతరులను కూడా మొరలను ఆలకించేవారిగా, ఆపద్బాంధవులుగా, అవసరాలు తీర్చేవారిగా నమ్మేవారు. తమ నైతిక, సామాజిక జీవన రంగాలలో అల్లాహ్‌కు బదులు వారి పెద్దలు, మతాధిపతులు చూపిన మార్గాన్ని అనుసరించడమే కాక వారినే తమ జీవన మార్గదర్శకులుగా చేసుకునే వారు. ఈ పోకడే వారిని చివరికి దౌర్జన్యాలకు ఒడిగట్టే జాతిగా, దైవాగ్రహానికి గురైన జాతిగా మార్చివేసింది.

ఆ వివరణ ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాల ద్వారా అవగతమవుతుంది:

"ఓ ప్రవక్తా(స)! ఒకవేళ వారు నీ సందేశం పట్ల విముఖులైతే వారితో ఇలా అను: 'ఆద్, సమూద్ జాతులపై అవతరించినటువంటిదీ, అకస్మాత్తుగా విరుచుకుపడేదీ అయిన ఒక శిక్షను గురించి నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను". దైవప్రవక్తలు వారి వద్దకు ముందు నుంచీ, వెనుకనుంచీ, అన్ని వైపుల నుంచీ వచ్చి, 'అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి' అని వారికి నచ్చజెప్పినప్పుడు, వారు ఇలా అన్నారు; 'మా ప్రభువు తలచుకుంటే దైవదూతలను పంపి ఉండేవాడు. కనుక నీవు ఏ విషయం కోసమైతే పంపబడ్డావో, ఆ విషయాన్ని మేము నమ్మము." *(హా మీమ్ అస్ సజ్‌దహ్ : 13,14)*

సమూద్ జాతి వద్దకు మేము వారి సోదరుడైన సాలెహ్‌ను పంపాము. అతను ఇలా హితోపదేశం చేశాడు. "నా జాతి ప్రజలారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు.... వారు ఇలా అన్నారు: "సాలిహ్! నిన్నటి వరకు మా మధ్య ఉన్న నీ మీద మేము పెద్ద పెద్ద ఆశలు పెట్టుకున్నాము. మా తాతముత్తాతలు పూజించిన దేవుళ్ళను పూజించకుండా మమ్మల్ని ఆపదలచుకున్నావా?" *(హూద్ : 61,62)*

వారి సోదరుడు సాలిహ్ వారికి ఇలా చెప్పినాడు, "ఏమిటి? మీరు భయపడరా? నేను మీ కొరకు వచ్చిన ఒక విశ్వసనీయుడైన దైవ ప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి.... హద్దులు మీరే వారి పట్ల విధేయత చూపకండి, వారు భూమిలో ఉపద్రవాన్ని సృష్టిస్తారు. ఏ సంస్కరణనూ చేపట్టరు".

*(అష్ షుఅరా : 142-144 మరియు 151, 152)*

## ఇబ్రాహీం (అలై) జాతి- నమ్రూద్

వీరి తర్వాత అత్యంత ప్రాచుర్యం పొందిన జాతి హజ్రత్ ఇబ్రాహీం (అలై) జాతి. ఈ జాతివారికి ఇంతగా ప్రాచుర్యం లభించటానికి కారణం, వారిని పాలించిన రాజు నమ్రూద్ దైవతిరస్కారి అని, తననుతాను ప్రభువుగా భావిస్తున్నాడనే అపోహ ప్రబలడమే. వాస్తవానికి అతడు దైవాన్ని విశ్వసించే వాడు. దైవాన్ని సృష్టికర్తగా, విశ్వమండల నిర్వాహకునిగా కూడా అంగీకరించే వాడు. కాని పైన తెలిపిన మూడవ, నాలుగవ, ఐదవ భావనల ప్రకారం మాత్రం, అతను తన 'సార్వభౌమత్వపు' దావా చేస్తుండేవాడు. ఈ జాతి వారికి నిజ దైవమైన అల్లాహ్‌ను గురించి తెలియదని లేదా ఆయనే దేవుడు మరియు ప్రభువు అన్నభావన వారిలో లేదని భావించడం పొరపాటే అవుతుంది. వాస్తవానికి వారి ఆలోచన నూహ్, ఆద్, సమూద్ జాతులకు ఏ మాత్రం తీసిపోని విధంగా ఉండేది. వారు అల్లాహ్ ఉనికిని కూడా అంగీకరించేవారు. ఆయననే ప్రభువుగా భూమ్యాకాశాలపై ఆధిక్యత గలవానిగా కూడా నమ్మేవారు. ఆయనను ఆరాధించడానికి కూడా తిరస్కరించేవారు కాదు. కాకపోతే వారి మార్గభ్రష్టత ఏమంటే, ప్రభువు మొదటి, రెండవ భావాలకు అనుగుణంగా వారు భూ నభాంతరాలలోని పదార్థాలను- పంచభూతములను కూడా దైవత్వంలో భాగస్వాములుగా భావించేవారు. ఇదే భావనతో వారు వారిని కూడా అల్లాహ్‌తోపాటు దైవాలుగా భావించేవారు. ఇక దైవత్వపు మూడవ, నాలుగవ,

ఐదవ భావనలకు అనుగుణంగా వారు తమ చక్రవర్తులను తమ ప్రభువుగా, దైవాంశసంభూతులుగా భావించేవారు. ఖుర్‌ఆన్ చాలా స్పష్టంగా ఈ విషయంలో వివరణ ఇచ్చింది. అసలు ఈ ప్రజలు వాస్తవాన్ని గ్రహించడంలో ఎలా ఏమరుపాటుకు గురై ఉన్నారని ఆశ్చర్యం కలుగుతుంది. అన్నింటికన్నా ముందుగా హజ్రత్ ఇబ్రాహీం(అలై)కు జ్ఞానోదయమైన సంఘటనను తీసుకొని అందులో ఆయన చేసిన సత్యాన్వేషణను చిత్రీకరించడం జరిగింది.

రాత్రి అతనిపై ఆవరించగానే అతను ఒక నక్షత్రాన్ని చూశాడు. అన్నాడు. 'ఇది నా ప్రభువు' అని, కాని అది అస్తమించగానే అతను 'అస్తమించేవాటిని నేను ప్రేమించను' అని అన్నాడు. చంద్రుడు ప్రకాశిస్తూ కనిపించగానే అతను 'ఇదీ నా ప్రభువు' అని అన్నాడు. కాని అదీ అస్తమించగానే 'నా ప్రభువు గనుక నాకు మార్గమే చూపి ఉండక పోతే, నేనూ మార్గభ్రష్టులలో కలిసిపోయి ఉండేవాణ్ణే' అని అన్నాడు. తరువాత అతను సూర్యుణ్ణి ప్రకాశిస్తూ ఉండగా చూసి 'అసలు ఇదీ నా ప్రభువు! ఇది అన్నింటికంటే పెద్దది' అని పలికాడు. కాని అది కూడా అస్తమించగానే ఇబ్రాహీం ఎలుగెత్తి ఇలా ప్రకటించాడు: నా జాతి సోదరులారా! మీరు దైవానికి భాగస్వాములుగా నిలబెట్టే వాటన్నింటితోనూ నాకు ఏ విధమైన సంబంధం లేదు. నేను ఏకాగ్రతతో నా ముఖాన్ని భూమ్యాకాశాలను సృష్టించిన శక్తి వైపునకు త్రిప్పుకున్నాను. నేను షిర్క్‌కు అనగా దైవానికి సాటి నిలబెట్టే వారిలోని వాణ్ణి ఎంతమాత్రం కాను". *(అన్‌ఆమ్ : 76–79)*

ఏ మాత్రం రాజీపడని ఈ పలుకుల ద్వారా స్పష్టంగా తెలిసేదేమిటంటే, ఏ సమాజంలోనైతే హజ్రత్ ఇబ్రాహీం(అలై) కళ్ళు తెరిచారో, ఆ సమాజంలో భూమ్యాకాశాలను సృష్టించిన దేవుడే పరమ ప్రభువు అన్న భావన, నక్షత్రాల ప్రభువు అన్న భావన వేర్వేరుగా ఉండేదని తెలుస్తుంది. ఎందుకంటే, వీరిలో

చాలామంది హజ్రత్ నూహ్(అలై)ను విశ్వసించి ముస్లిం వంశీయులు. ఆద్, సమూద్ జాతుల వారు వీరి దగ్గరి బంధువులు కావడం ఒక కారణమైతే, మరో కారణం, కాలానుగుణంగా అనేకమంది ప్రవక్తలు ఇస్లాం సందేశాన్ని వీరి మధ్య ప్రచారం చేసి ఉండటమే. ఈ కారణంచేతనే హజ్రత్ ఇబ్రాహీం(అలై)కు అల్లాహ్‌యే భూమ్యాకాశాల ప్రభువు అన్న భావన తన జాతివారి నుండే సంక్రమించిందని అర్థమవుతుంది. కాకపోతే తన జాతివారు ఈ విశ్వవ్యవస్థలో అల్లాహ్‌తోపాటు సూర్యచంద్రులను, నక్షత్రాలను భాగస్వాములుగా భావించి ఆయనతోపాటు వాటిని కూడా ఆరాధించడం ఎంతవరకు యదార్థమన్న విషయం ఆయనకు మింగుడుపడేది కాదు. ఈ కారణం చేతనే ప్రవక్తగా నియమించబడక ముందు ఆయన అన్వేషణలో, సూర్యోదయ, సూర్యాస్త మయాల ఏర్పాట్లే ఆయనను భూమ్యాకాశాల నిజప్రభువు అల్లాహ్‌యేనని గ్రహించేలా చేశాయి. అందుకే చంద్రుడు అస్తమించడం చూసి ఆయన ఇలా అన్నాడు : ఒకవేళ నా ప్రభువు అల్లాహ్ నన్ను కరుణించి ఉండకపోతే, నేను వాస్తవాన్ని గ్రహించలేకపోయేవాడిని. నా జాతి ప్రజలందరిలాగానే నేను కూడా మోసానికి గురయ్యి మార్గభ్రష్టుడినయ్యేవాడిని.

ప్రవక్త పదవిని అలంకరించిన తరువాత ఆయన తన సందేశ ప్రచారానికి వాడిన పదాలను పరిశీలించి నట్లయితే పైన మేము వివరించిన వాస్తవాన్ని ఇంకా స్పష్టంగా అర్థం చేసుకో వచ్చు. హజ్రత్ ఇబ్రాహీం(అలై) ఇలా అన్నారు:

> "నేను అసలు మీరు నిలబెట్టే భాగస్వాములకు ఎందుకు భయపడాలి? వాటి విషయంలో అల్లాహ్ మీపై ఏ ప్రమాణాన్ని అవతరింపజేయ నప్పటికీ వాటిని మీరు ఆయనతోపాటు దైవత్వంలో భాగస్వాములుగా చేస్తూ భయపడనప్పుడు". *(అన్ఆమ్ : 81)*
>
> "మీరు అల్లాహ్‌ను కాదని వేడుకుంటున్న శక్తులతో కూడా నేను తెగ తెంపులు చేసుకుంటున్నాను." *(మర్యమ్– 48)*

ఇలా అను, "వాస్తవానికి భూమికీ, ఆకాశాలకూ ప్రభువైనవాడే, వాటిని సృష్టించినవాడే మీ ప్రభువు... ఇంకా ఇలా అన్నాడు: అయితే, మీరు అల్లాహ్‌ను కాదని మీకు లాభంకానీ, నష్టంకానీ కలిగించగల సామర్థ్యం లేని వాటిని పూజిస్తున్నారా? *(అంబియా : 56,66)*

ఇబ్రాహీం(అలై) తన తండ్రితోనూ, తన జాతి ప్రజలతోనూ ఇలా అన్నాడు: "మీరు ఆరాధిస్తున్న ఈ వస్తువులేమిటి? అల్లాహ్‌ను కాదని మీరు మిథ్యాదైవాలను కోరుకుంటున్నారా; అసలు సకల లోకాల ప్రభువు విషయంలో మీ అభిప్రాయమేమిటి?" *(సాఫ్ఫాత్ : 85-87)*

ఇబ్రాహీం(అలై), ఆయన సహచరులు తమ జాతివారితో స్పష్టంగా ఇలా అన్నారు; మీ పట్ల, దేవుణ్ణి వదలి మీరు పూజించే ఇతర దైవాల పట్ల మేము పూర్తిగా విసిగిపోయాము. మేము మిమ్మల్ని తిరస్కరించాము. మీరు ఏకైక ప్రభువైన అల్లాహ్‌ను విశ్వసించనంతవరకు మాకూ మీకూ మధ్య విరోధ, విద్వేషాలు ఉండిపోతాయి.

*(ముమ్తహినహ్- 4)*

హజ్రత్ ఇబ్రాహీం(అలై) గారి ఈ బోధనలన్నీ పరిశీలించాక అర్థమయ్యే దేమిటంటే, ఏ జాతిని ఉద్దేశించి ఆయన హితోపదేశం చేస్తున్నారో, వారికి అల్లాహ్ గురించి తెలియదనికాదు. ఆయనే సకల లోకాలకు ప్రభువు, పూజ నీయుడు అన్న విషయాన్ని కూడా వారు తిరస్కరించేవారు కాదు. కాని వారు దైవత్వంలో, పాలనా వ్యవస్థలో (మొదటి, రెండవ భావాలలో) ఇతరులను కూడా భాగస్వాములుగా భావించేవారు. కనుకనే మొత్తం ఖుర్‌ఆన్‌లో ఎక్కడా కూడా ఇబ్రాహీం(అలై) అల్లాహ్‌ను దేవునిగా, ప్రభువుగా పరిచయం చేసే ప్రయత్నం చేయలేదు. దానికి భిన్నంగా 'అల్లాహ్‌యే మీ దేవుడు, ప్రభువు' అని సందేశమిచ్చేవారు.

ఇక నమ్రూద్ విషయానికి వస్తే, అతనితో హజ్రత్ ఇబ్రాహీం(అలై) జరిపిన సంభాషణను ఖుర్‌ఆన్ ఈ విధంగా నకలు చేసింది.

"ఇబ్రాహీం ప్రభువు ఎవరు అనే విషయంపై అతనితో వివాదపడిన వ్యక్తి విషయాన్ని గురించి నీవు ఆలోచించలేదా? అల్లాహ్ ఆ వ్యక్తికి రాజ్యాధికారం ఇవ్వటం వల్ల ఈ వివాదం తలెత్తింది. 'జీవన్మరణాలు ఎవరి ఆధీనంలో ఉన్నాయో, ఆయనే నా ప్రభువు' అని ఇబ్రాహీం అన్నప్పుడు, అతడు ఇలా జవాబు పలికాడు: 'చావు బ్రతుకులు రెండూ నా అధీనంలోనే ఉన్నాయి'. ఇబ్రాహీం ఇలా అన్నాడు: 'సరే అల్లాహ్ సూర్యుణ్ణి తూర్పు నుండి ఉదయింపజేస్తాడు. నీవు కాస్త దానిని పడమర నుండి ఉదయింపజేయి'. ఇది విన్న ఆ సత్యతిరస్కారి బిత్తర పోయాడు". *(బఖర : 258)*

పై సంభాషణ పరిశీలించాక తెలిసేదేమంటే, ఇక్కడ వివాదం, 'దేవుడు ఉన్నాడా? లేడా?'అని కాదు. ఇబ్రాహీం(అలై) ఎవరిని తన ప్రభువుగా భావిస్తున్నాడు? అన్నదే అసలు వివాదం. అసలు విషయమేమిటంటే, నమ్రూద్ దేవుడున్నాడని నమ్మే జాతికి చెందినవాడు. ఇంకా, నేనే ఈ భూమ్యాకాశాలకు రాజును, సూర్యచంద్రుల భ్రమణం నా అధీనంలోనే ఉన్నాయని చెప్పేటంతటి వెర్రివాడు కూడా కాదు. నమ్రూద్, 'నేనే దేవుణ్ణి, భూమ్యాకాశాలకు నేనే ప్రభువుని'అని కూడా అతడు వాదించలేదు. నమ్రూద్ వాదన ఏమిటంటే, నేను నా అధీనంలో ఉన్న సామ్రాజ్యానికి 'ప్రభువు'ను. నా సామ్రాజ్యంలో ఇబ్రాహీం కూడా ఒక పాలితుడు. ప్రభువు అన్న ఈ వాదన కూడా కేవలం పైన తెలిపిన మొదటి,రెండవ భావన లాంటిది కూడా కాదు. ఎందుకంటే, ఆ వాదన ప్రకారమైతే అతడే ఈ సూర్యచంద్రులకు, నక్షత్రాలకు కూడా ప్రభువు కావాలి. కాకపోతే ప్రభువుగా అతని వాదన ముందుగా తెలిపిన మూడవ, నాలుగవ, ఐదవ భావనలా తన సామ్రాజ్యానికి 'అధిపతి'గా భావించాడు. అనగా నమ్రూద్ వాదన ఏమిటంటే, నేను నా సామ్రాజ్యానికి అధిపతిని. ఇందు లోని సమస్త పౌరులు నా సేవకులు, పాలితులు. నా ప్రభుత్వాధికారమే వారి సామూహికతకు పునాదిలాంటిది. నా ఆజ్ఞలను శిరసావహించడం వారికి

తప్పనిసరి (అన్ ఆతాహుల్లాహుల్ ముల్క్) అనే అతని మాటలు తాను చక్రవర్తిని కనుక తన ఆదేశమే చెల్లుబడి కావాలన్న ధోరణిని చెప్పకనే చెబుతున్నాయి. తన సామ్రాజ్యంలో ఇబ్రాహీమ్(అలై) అనే ఒక వ్యక్తి ఇటు సూర్యచంద్రులను, నక్షత్రాలను దేవుళ్ళుగా అంగీకరించటానికి గాని లేక తన పౌర ప్రభుత్వాధిపత్యాన్ని అంగీకరించటానికిగాని సిద్ధంగా లేడని తెలిసి ఆశ్చర్యపోయాడు. ఇబ్రాహీం(అలై)ను పిలిపించి, 'అసలు నీవు ఎవరిని ప్రభువుగా భావిస్తున్నావు?' అని ప్రశ్నించాడు. 'ఎవరి అధీనంలో నా జీవన్మరణాలున్నాయో, ఆయనే నా ప్రభువు' అని ఇబ్రాహీం(అలై) సమాధానం ఇచ్చాడు. ఇబ్రాహీం(అలై)గారి భావన అతనికి అర్థంకాక 'జీవన్మరణాలైతే నా అధీనంలో ఉన్నాయి. నేను కోరినవారిని చంపించగలను, నేను కోరినవారికి ప్రాణభిక్ష పెట్టగలను కనుక నేనే ప్రభువును' అని సమర్థించుకున్నాడు. అప్పుడు ఇబ్రాహీం(అలై), 'నేను మాత్రం కేవలం అల్లాహ్‌నే నా ప్రభువుగా భావిస్తాను. దైవత్వపు సకల గుణగణాల, అధికారాల దృష్ట్యా, నా దృష్టిలో అల్లాహ్ మాత్రమే నిజమైన ప్రభువు. సూర్యోదయం, సూర్యాస్తమయాలను రవ్వంత కూడా ప్రభావితం చేయలేనివారికి ఈ విశ్వవ్యవస్థ సార్వభౌమత్వంలో భాగస్వాములయ్యే అవకాశమే లేదు'అన్నారు. ఇబ్రాహీం(అలై) గారి ఈ వాదన విన్న నమ్రూద్‌కు వాస్తవం అర్థమైంది. అల్లాహ్ విశ్వాధిపత్యంలో తన ప్రభుత (రుబూబియత్) వాదన ఎంత అర్థరహితమైందో కూడా తెలిసి నిశ్చేష్టుడయ్యాడు. వాస్తవం తెలిసినప్పటికీ, మనోవాంఛల దాస్యం, అహం, తాతముత్తాతలనాటి నుండి అనువంశిక రాజరికాధిపత్యపు భావన, వాస్తవాన్ని ఒప్పుకోవటంలో అడ్డంకిగా నిలిచింది. తన రాజ్యాధికార భావనను వదిలి అల్లాహ్‌కు, ప్రవక్తకు విధేయత చూపటానికి అంగీకరించనియ్యలేదు. అందుకే ఈ సంభాషణను నకలు చేస్తూ అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు".

'అల్లాహ్ దుర్మార్గులకు రుజుమార్గం చూపడు' *(బఖరా : 258)*

వాస్తవం తెలిసిన తరువాత కూడా సత్యపథాన్ని అనుసరించకుండా

దైవవిధేయతను తిరస్కరించి నిరంకుశ పెత్తనంతో లోకంపై అన్యాయానికి ఒడిగట్టడమేగాక స్వయంగా తన ఆత్మపై కూడా దుర్మార్గానికి ఒడిగట్టడానికే సిద్ధపడ్డాడు. కనుకనే అల్లాహ్ నమ్రూద్‌కు సన్మార్గజ్యోతిని ప్రసాదించలేదు. స్వయంగా ఎవరైనా రుజుమార్గం వైపు మరలడానికి సిద్ధపడనంతవరకు అల్లాహ్ కూడా బలవంతంగా వారిని రుజుమార్గం వైపు మరల్చడు.

## లూత్ (అలై) జాతి వారు

ఇబ్రాహీం(అలై) జాతి వారి తరువాత ఖుర్‌ఆన్ ప్రస్తావించిన మరో జాతి లూత్(అలై) జాతి. ఈ జాతి వారు కూడా దేవుని అస్తిత్వాన్ని తిరస్కరించే వారు కాదని ఖుర్‌ఆన్ ద్వారా మనకు తెలుస్తోంది. మొదటి, రెండవ భావాల ప్రకారం, వీరు అల్లాహ్‌నే ప్రభువుగా భావించేవారు. కాకపోతే మూడవ, నాలుగవ, ఐదవ భావాలకు అనుగుణంగా అల్లాహ్‌యే ప్రభువు అని అంగీకరించడానికి సిద్ధంగా లేరు. అలాగే ఆయన ప్రతినిధిగా ప్రవక్త బోధనలను శిరసావహించడానికి కూడా సిద్ధంగా లేరు. వారు తమ మనోవాంఛలనే దైవాలుగా చేసుకొని వారి ఇష్టమొచ్చిన రీతిలో వ్యవహరించేవారు. ఇదే ఆ జాతి వారి అసలు నేరం. ఇదే ఆ జాతి వారిని దైవశిక్షకు గురి అయ్యేలా చేసింది. ఈ వాస్తవాలే ఖుర్‌ఆన్ వరుస క్రమంలో ఈ క్రింది విధంగా వివరించింది.

> అప్పుడు వారి సోదరుడు లూత్(అలై) వారితో ఇలా అన్నాడు; "మీరు భయపడరా? నేను మీ కొరకు ఒక విశ్వసనీయుడైన దైవప్రవక్తను. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. నా యెడల విధేయత చూపండి. నేను ఈ పనికై మీ నుండి ఏ ప్రతిఫలాన్నీ కోరను. నా ప్రతిఫలం సకల లోకాల ప్రభువు బాధ్యత. మీరు ప్రపంచంలోని ప్రాణులలో పురుషుల వద్దకు పోతారేమిటి, మీ ప్రభువు మీ భార్యలలో మీకై సృష్టించిన దానిని విడిచిపెడుతున్నారేమిటి? మీరు హద్దులన్నీ అతిక్రమించారు".
>
> (అష్ షుఅరా : *161-166*)

అల్లాహ్ ఉనికిని గుర్తించి, ఆయనే ఈ సృష్టికి యజమాని, ప్రభువు అని విశ్వసించేవారి ముందు మాత్రమే ఇలాంటి ప్రసంగం చేయబడుతుంది. కనుకనే దీనికి సమాధానంగా వారు కూడా 'అల్లాహ్ అంటే ఎవరు? సృష్టించ డానికి ఆయనెవరు? ఆయనెలా మా ప్రభువు అవుతాడు?' అని ప్రశ్నించలేదు. దానికి బదులుగా వారు ఇలా అన్నారు:

"ఓ లూత్! నీవు ఈ మాటలు మానుకోకపోతే మా నగరాల నుండి గెంటివేయబడతావు." *(షుఅరా : 167)*

మరో చోట ఇదే విషయాన్ని ఇలా పేర్కొనటం జరిగింది–

"మేము లూత్‌ను పంపాము; అప్పుడు అతను తన జాతి వారితో ఇలా అన్నాడు: 'మీకు పూర్వం ప్రపంచ మానవులలో ఎవ్వరూ చేయని అశ్లీల కార్యాన్ని మీరు చేస్తున్నారు. ఇదేమిటి, మీరు పురుషుల వద్దకు పోతారు, దారిదోపిడీలు చేస్తారు, మీ సభలలో అసభ్యకరమైన పనులు చేస్తారు?' అప్పుడు అతని జాతివారు ఇలా సమాధానమివ్వటం తప్ప మరొక విషయమేదీ పలుకలేదు: 'నీవు నిజాయితీపరుడవే అయితే తీసుకురా అల్లాహ్ శిక్షను'. *(అన్‌కబూత్ : 28,29)*

ఇలాంటి సమాధానం దైవతిరస్కారుల నోట వస్తుందా? ముమ్మాటికీ రాదు. కనుక అర్థమయ్యేదేమిటంటే, వారి అసలు నేరం దైవత్వానికి, లేదా దేవుని సార్వభౌమత్వానికి సంబంధించినది కాదు. వాస్తవానికి వారు అల్లాహ్‌యే దేవుడు, సర్వసత్తాక ప్రభువు అని అంగీకరించేవారు. కాని నైతిక, పౌర, సామాజిక, విషయాలలో మటుకు దైవ విధేయతను, ఆయన ఆజ్ఞాపాలనను తిరస్కరించేవారు. ఇంకా ఆయన ప్రవక్తలు చూపిన మార్గంలో నడవటానికి సిద్ధంగా లేరు.

## షుఐబ్ (అలై) జాతి వారు

దీని తరువాత మద్‌యన్, అయ్‌క వాసులను తీసుకుంటే, ఈ జాతివారి వైపు షుఐబ్(అలై)ను ప్రవక్తగా చేసి పంపడం జరిగింది. వీరు హజ్రత్ ఇబ్రాహీం (అలై) గారి సంతానంలోని వారు. అందువల్ల వీరు అల్లాహ్ ఉనికిని, ఆయనే దేవుడు, ప్రభువు అనే విషయాన్ని నమ్మేవారా? కాదా? అన్న సందేహమే రాదు. ఎందుకంటే, వీరి ఉనికే ఇస్లాంతో ప్రారంభమైంది. దాని తరువాత వారి నమ్మకాలు, ఆచరణలు పెడమార్గాన పట్టి వారు మార్గభ్రష్టతకు గురయ్యారు. వీరిని ఏమరుపాటుకు గురైన విశ్వాసులని ఖుర్ఆన్ పేర్కొంది. అందుకే హజ్రత్ షుఐబ్(అలై) వారిని పదేపదే 'మీరు విశ్వాసులే అయితే, మీరు ఇలా చెయ్యండి' అని చెప్పేవారు. హజ్రత్ షుఐబ్(అలై)గారి ప్రసంగాలను, దానికి ఆయన జాతివారు ఇచ్చిన సమాధానాలను పరిశీలిస్తే అర్థమయ్యే విషయమేమిటంటే, ఈ జాతివారు అల్లాహ్‌ను విశ్వసించేవారు. అల్లాహ్‌ను ఆరాధ్యుడుగా, పాలకునిగా, పోషకునిగా కూడా అంగీకరించేవారు. కాని వీరు రెండు విధాలైన మార్గభ్రష్టతకు లోనై ఉండేవారు. ఒకటి, అల్లాహ్‌తోపాటు ఇతరులను కూడా దేవునిగా, ప్రభువుగా భావించేవారు. అందుకే వారి ఆరాధనలు కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం కాలేదు. రెండవది: వారి దృష్టిలో– దైవప్రణాళికకు, కార్యనిర్వాహణకు మానవుల నైతిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక సంబంధమైన విషయాలలో ఎలాంటి సంబంధం లేదు. అందుకే వారు తమ సామాజిక జీవన వ్యవహారాలలో తమదే ఇష్టారాజ్యమని భావించేవారు.

ఖుర్ఆన్‌లోని ఈ క్రింది వాక్యాలను పరిశీలిస్తే వారి ఈ భావనలు స్పష్టంగా తెలుస్తాయి.

"మేము మద్‌యను జాతి వారి వద్దకు వారి సోదరుడు షుఐబ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. మీ వద్దకు మీ ప్రభువు యొక్క స్పష్టమైన మార్గదర్శకత్వం వచ్చింది. కనుక తూకాన్ని,

కొలతను పూర్తిగా పాటించండి. ప్రజలకు వారి వస్తువుల విషయంలో నష్టం కలిగించకండి. భూమి సంస్కరింపబడిన తరువాత దానిలో సంక్షోభాన్ని సృష్టించకండి. ఇందులోనే మీ శ్రేయస్సు ఉంది. మీరు నిజంగానే విశ్వాసులైతే ......... ఏ ఉపదేశాన్ని ఇచ్చి నన్ను పంపడం జరిగిందో దానిని మీలోని ఒక వర్గం విశ్వసించి మరొక వర్గం విశ్వసించకపోతే అల్లాహ్ మన మధ్య తీర్పు చెప్పే వరకు సహనంతో నిరీక్షించండి. ఆయనే అందరికంటే ఉత్తమంగా తీర్పు చెప్పేవాడు".

*(ఆరాఫ్ : 85- 87)*

"నా జాతి సోదరులారా! ఖచ్చితంగా, న్యాయంగా పూర్తిగా కొలవండి, తూచండి. ప్రజలకు వారి వస్తువులను తక్కువ చేసి ఇవ్వకండి. భూమిపై సంక్షోభాన్ని వ్యాపింపజేస్తూ తిరగకండి. అల్లాహ్ ప్రసాదించిన మిగులే మీకు మేలైనది, మీరు విశ్వాసులే అయితే, ఏమైనప్పటికీ నేను మీపై కావలి వాణ్ణి మట్టుకు కాను". వారు ఇలా సమాధానం చెప్పారు: **షుఐబ్! మా తాతముత్తాతలు పూజించిన దేవుళ్ళందరినీ మేము వదిలిపెట్టాలనీ, లేదా మా ధనాన్ని మా ఇష్టాను సారం ఖర్చుచేసుకునే అధికారం మాకు ఉండకూడదనీ, నీకు నీ నమాజు నేర్పుతున్నదా?** ఇక ఉదాత్త హృదయుడవూ, రుజువర్తనుడవూ కేవలం నీవు ఒక్కడివే మిగిలి పోయావు!" *(హూద్ : 85-87)*

ప్రత్యేకించి చివరి వాక్యాలను పరిశీలిస్తే దేవుని దైవత్వం పట్ల, దైవకార్య నిర్వహణపట్ల వారి ఆలోచనా ధోరణి ఎలాంటి మార్గభ్రష్టతకు లోనై ఉన్నదో చాలా స్పష్టంగా అర్థమవుతుంది.

## ఫిరౌన్, ఫిరౌన్ జనులు

ఇప్పుడు మనం ఫిరౌన్ గురించి, ఫిరౌన్ జాతివారి గురించి తెలుసుకుందాం. వీరి విషయంలో నమ్రూద్, ఆయన జాతివారికంటే ఎక్కువ

అపోహలు కానవస్తాయి. ఫిరౌన్, దేవుని ఉనికిని తిరస్కరించడమేకాక తానే ప్రభువునని విర్రవీగేవాడని సాధారణంగా అందరూ భావిస్తారు. అంతేకాదు, బహిరంగంగా నేనే భూమ్యాకాశాల నిర్మాతను అనేంతటి ఉన్మాదిగా మారాడని అనుకునేవారు. ప్రజలు కూడా పిచ్చి వారిలా (అజ్ఞానుల్లా) ఆయననే విశ్వసించే వారని చాలామంది భావించారు. కాని వాస్తవంగా ఖుర్ఆన్, చరిత్ర ద్వారా తెలిసేదేమిటంటే,

దైవత్వం, ప్రభుత్వాధికార భావనలో నమ్రూద్, నమ్రూద్ జాతి వారి మార్గభ్రష్టత, ఫిరౌన్ మరియు ఫిరౌన్ జాతి వారి మార్గభ్రష్టతలో పెద్దగా వ్యత్యాసం లేదు. ఇక్కడ కనిపించే భేదమల్లా ఒక్కటే. బనీ ఇస్రాయీల్‌లో రాజకీయ ప్రాబల్యం వల్ల జాత్యాహంకారం, వర్గ దురభిమానపు హోరం, మంకుతనం పొడసూపాయి. కేవలం వర్గవైషమ్యం కారణంగానే అల్లాహ్‌ను దేవునిగా, ప్రభువుగా అంగీకరించడానికి వారికి అహం అడ్డుపడేది. కాని ఏవిధంగానైతే నేటి నాస్తికులలో దైవభావన దాగి ఉన్నదో అలాంటి భావనే వారి హృదయాలలో కూడా దాగి ఉండేది.

అసలు విషయమేమిటంటే, దైవప్రవక్త హజ్రత్ యూసుఫ్(అలై) ఈజిప్టు సింహాస నాన్ని అధిరోహించాక, తన సర్వాధికారాలను ఉపయోగించి ఇస్లాం ధర్మ సందేశాన్ని వ్యాపింపజేశారు. దాని ప్రభావం ఈజిప్టు భూభాగంపై ఎంత బలంగా నాటుకుపోయిందంటే శతాబ్దాలు గడిచిపోయినా ప్రజల హృదయాల నుండి దాన్ని ఎవరూ చెరపలేకపోయారు. వాస్తవానికి ఆ కాలంలో మొత్తం ఈజిప్టువాసులు సత్యధర్మాన్ని స్వీకరించకపోయినప్పటికీ, అల్లాహ్ ఉనికిని, ఆయనే దేవుడూ, ఆయనే భూమ్యాకాశాల నిర్మాత అన్న భావన లేనివారు మాత్రం కాదు. అంతేకాక హజ్రత్ యూసుఫ్(అలై) గారి బోధనల ఫలితంగా దాదాపుగా ఈజిప్టు వాసులంతా 'సర్వోన్నత ప్రభువు' అన్న భావనలో అల్లాహ్‌ను దైవాధి దేవునిగా, రాజాధిరాజుగా భావించేవారు. ఇంకా ఏ ఒక్కరు కూడా దేవుని ఉనికిని తిరస్కరించేవారు కాదు. కాని ఎవరైతే దైవాన్ని తిరస్కరించేవారో

వారు మాత్రమే అల్లాహ్ దైవత్వంలో పాలనా వ్యవస్థలో ఇతరులను భాగస్వాములుగా చేర్చేవారు. దీని ప్రభావం హజ్రత్ మూసా(అలై) ప్రభవనం దాకా మిగిలి ఉంది.[1]

ఫిరౌన్ నిండు సభలో ఒక ఖిబ్తీ సర్దార్ చేసిన ప్రసంగమే దీనికి ప్రబల సాక్ష్యం. ఫిరౌన్ చక్రవర్తి హజ్రత్ మూసా(అలై)ను చంపాలని పన్నాగం పన్ను తున్నప్పుడు ఆ సభలో ఉన్న (అప్పటికే ముస్లింగా మారి, ఆ విషయాన్ని దాచివుంచిన) ఒక పెద్దమనిషి కలత చెందిన మనసుతో– వెంటనే లేచి ఇలా అన్నాడు:

"మీరు ఒక వ్యక్తిని కేవలం అతడు 'నా ప్రభువు అల్లాహ్' అని అన్నంత మాత్రాన్నే చంపేస్తారా? వాస్తవానికి అతను మీ ప్రభువు వద్ద నుండి మీ వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకువచ్చాడు. ఒకవేళ అతను అబద్ధాలు చెప్పేవాడే అయితే, అతని అబద్ధం స్వయంగా అతని మీదనే

---

*1. ఒకవేళ తౌరాత్ ద్వారా తెలిసిన చారిత్రక వివరణను నమ్మినట్లయితే దాదాపుగా ఈజిప్టులో ఐదవవంతు ముస్లింలుగా మారినట్లు తెలుస్తుంది. తౌరాత్ గణాం కాల ప్రకారం, హజ్రత్ మూసా(అలై) వెంట బయలుదేరి వచ్చిన బనీ ఇస్రాయీలుల సంఖ్య సుమారు 20 లక్షలు. ఆ రోజులలో ఈజిప్టు జనాభా కోటికి మించిలేదు. తౌరాత్‌లో వారందరినీ బనీఇస్రాయీల్ వంశీయులుగా పేర్కొనడం జరిగింది. కాని ఏ లెక్కన చూసినా హజ్రత్ యాకుబ్(అలై) గారి పన్నెండు మంది కుమారుల సంతానం రెండు వందల సంవత్సరాల కాలంలో పెరిగి ఇరువై లక్షలు కావడం అసంభవం. కనుక ఒక అంచనా ప్రకారం, వారంతా ఆ తరువాతి కాలంలో ముస్లింలుగా మారిన ఈజిప్టువాసులేనని తెలుస్తుంది. ఇస్రాయీల్ సంతతి ఈజిప్టును వదిలి వెళ్ళిపోతున్న సమయంలో (అనగా హిజ్రత్ సమయంలో) ముస్లిములైన ఈజిప్షియన్లు కూడా బనీఇస్రాయీల్ వారితో కలిసిఈజిప్టు వదిలి ఉంటారన్నది ఒక అనుమానం. దీనినిబట్టి హజ్రత్ యూసుఫ్(అలై) మరియు ఆయన అనుచరులు చేసిన సత్యసందేశ ప్రచారాన్ని మనం అంచనా వేయవచ్చు.*

తిరిగి పడుతుంది. కాని ఒకవేళ అతను సత్యమే చెబుతున్నట్లయితే అతను మిమ్మల్ని భయపెడుతున్న భయంకరమైన పరిణామాలలో కొన్ని అయినా మీ మీదకు తప్పకుండా వచ్చిపడతాయి. హద్దులను అతిక్రమించే, అసత్యాలు పలికే ఏ వ్యక్తికీ అల్లాహ్ సన్మార్గం చూపడు. నా జాతి ప్రజలారా! మీకు ఈనాడు రాజ్యాధికారం ఉన్నది. భూమిపై మీరు ప్రాబల్యం వహించి ఉన్నారు. కాని ఒకవేళ దైవశిక్ష మనపైకి వచ్చిపడితే, అప్పుడు మనకు సహాయం చేయగలవాడెవడైనా ఉన్నాడా?..... నా జాతి ప్రజలారా! పూర్వం అనేక జన సమూహాలకు దాపురించిన దినమే, మీకు కూడా దాపురిస్తుందేమో అని నేను భయపడుతున్నాను. నూహ్ జాతి, ఆద్ జాతి, సమూద్ జాతులకూ, వారి తరువాత వచ్చిన జాతులకూ దాపురించిన దినం.. పూర్వం యూసుఫ్(అలై) మీ వద్దకు స్పష్టమైన ప్రమాణాలను తీసుకువచ్చాడు. కాని మీరు అతను తెచ్చిన బోధను గురించి అనుమానానికే గురయ్యారు. తరువాత అతను మరణించినప్పుడు మీరు, 'ఇక అతని తరువాత అల్లాహ్ మరొక ప్రవక్తను పంపడు' అని అన్నారు. ..... నా జాతి ప్రజలారా! ఇదేమి వైపరీత్యం! నేను మిమ్మల్ని ముక్తి వైపునకు పిలుస్తున్నాను, మీరేమో నన్ను అగ్ని వైపునకు పిలుస్తున్నారా? నేను అల్లాహ్‌ను తిరస్కరించాలనీ, నేను ఎరుగని శక్తులను ఆయనకు భాగ స్వాములుగా నిలబెట్టాలనీ మీరు నాకు పిలుపునిస్తున్నారు. నిజానికి నేను మిమ్మల్ని సర్వశక్తి సంపన్నుడూ, క్షమాశీలుడూ అయిన దేవుని వైపునకు పిలుస్తున్నాను". *(అల్‌మూమిన్ : 28,29 మరియు 41,42)*

పై వృత్తాంతమంతా పరిశీలించాక తెలిసే విషయమేమిటంటే, వందల సంవత్సరాలు గడిచిపోయినప్పటికీ హ్రజత్ యూసుఫ్(అలై)గారి బోధనలు, వ్యక్తిత్వ ప్రభావం వారిపై ఇంకా మిగిలేవుంది. ఆయన బోధనలతో ప్రభావిత

మైన ఈ జాతివారు దైవ తిరస్కార వైఖరికి పాల్పడేవారనిగాని లేక అల్లాహ్‌యే దేవుడు, ప్రభువు అని భావించని వారనిగాని చెప్పలేము. అలాగే ఈ విశ్వ వ్యవస్థపై అల్లాహ్ అధికారం, ఆధిపత్యమే సాగుతుందని, ఆయన ఆగ్రహానికి భయపడాలనిగాని తెలియని వారేమి కాదు. చివరన ఉద్ఘాటించిన విషయాన్ని పరిశీలిస్తే ఈ జాతి వారు దేవుని దైవత్వం, ప్రభుత్వాధికార విషయంలో ఏమరుపాటుకు గురై ఉన్నారని కూడా భావించలేము. వీరి మార్గభ్రష్టత ఏమిటంటే, ఇతర జాతులలాగానే వీరు కూడా అల్లాహ్ దైవత్వంలో, ఆయన ప్రభుత్వాధికారంలో ఇతరులను కూడా భాగస్వాములుగా భావించేవారు.

హజ్రత్ మూసా(అలై)నోట 'నేను సకల లోకాల ప్రభువు తరపున నియమించబడిన సందేశహరుణ్ణి' అన్నమాట విని ఫిరౌన్, 'సకల లోకాల ప్రభువు అంటే ఏమిటి?' అని ప్రశ్నించాడు. ఇంకా తన మంత్రి హామానుతో ఇలా అన్నాడు: 'నా కోసం ఒక ఎత్తయిన భవనాన్ని నిర్మించండి. నేను వెళ్ళి ఈ మూసా(అలై) ప్రభువును చూసి వస్తాను'అని అన్నాడు. అంతేకాదు, 'నన్ను తప్ప మరెవరినైనా దేవునిగా చేసుకుంటే నిన్ను జైలులో బంధిస్తాను' అని మూసా(అలై)ను బెదిరించాడు. ఇంకా 'నేనే మీ ఉన్నత ప్రభువు'ను అని రాజ్యమంతా చాటింపు వేయించాడు.

'నేను నన్ను తప్ప మీకు చెందిన మరే దేవుణ్ణి నేను ఎరుగను' అని తన సభికులతో అన్నాడు. ఈ విధమైన పలుకులను గమనించిన తరువాత అతడు దేవుని అస్తిత్వాన్నే త్రోసిపుచ్చుతున్నాడనీ, సమస్త లోకాల ప్రభువు అంటే ఏమిటో అతనికి బొత్తిగా తెలీదనీ, తన్నుతానే ఆరాధ్య దైవంగా ఊహించుకుంటున్నాడని జనులకు అనుమానం వచ్చింది.

వాస్తవానికి ఫిరౌన్ యొక్క వెకిలిచేష్టలన్నింటికీ అసలు కారణం అతని జాత్యాహంకార స్వభావమే.

హజ్రత్ యూసుఫ్(అలై)గారి ఉన్నత వ్యక్తిత్వం కారణంగా ఈజిప్టులో

ఇస్లాం వ్యాపించడమేకాక ఆయన రాజ్యాధికారం వల్ల ఇస్రాయీల్ సంతతి వారు ఈజిప్టులో ఎంతో ప్రాబల్యాన్ని వహించారు. మూడు, నాలుగు వందల సంవత్సరాల వరకు ఈజిప్టుపై వారి ఆధిపత్యాన్ని కొనసాగింది. కాని తిరిగి బనీఇస్రాయీల్ వారిలో జాత్యాహంకార దురభిమానం పెచ్చరిల్లింది. చివరికి అదే వారిని రాజ్యాధికారాన్ని కోల్పోయేలా చేసింది. వారి స్థానంలో ఇతరులు రాజ్యాధికారాన్ని చేజిక్కించుకున్నారు. వారు ఇస్రాయీల్ జాతివారిని అణిచివేయడానికి ప్రయత్నించటమేకాక హజ్రత్ యూసుఫ్(అలై) గారి ఇస్లాం బోధనలను ఒక్కొక్కటిగా చెరిపివేయడానికి కృషి చేశారు. అంతేకాదు, తాతముత్తాతల కాలం నాటి మార్గభ్రష్ట ఆచారాలకు తిరిగి ప్రాణం పోయటానికి ఎనలేని కృషి చేశారు. ఈ పరిస్థితులలో మూసా(అలై) గారు అరుదెంచడంతో తమ ఈ అధికారం ఎక్కడ తిరిగి ఇస్రాయీల్ సంతతి వారి చేతులలోకి వెళ్ళి పోతుందోనని భయపడ్డారు. ఈ జాత్యాహంకార దౌష్ట్యమే ఫిరౌన్‌ను, హజ్రత్ మూసా(అలై)తో, సకల లోకాల ప్రభువెవరు? నేనుకాక మరో దేవుడెవరున్నారు?' అని ప్రశ్నించేలా చేసింది. వాస్తవానికి ఫిరౌన్, ఆయన సభికుల మధ్య జరిగిన సంభాషణ ద్వారానూ, ఖుర్‌ఆన్ నందు ప్రస్తావించబడ్డ మూసా(అలై) ప్రసంగం ద్వారానూ మనకు తెలిసేదేమిటంటే, 'సకల లోకాల ప్రభువు' అన్నదాని భావన ఫిరౌన్‌కు పూర్తిగా తెలుసు. ఉదాహ రణకు, ఒకసారి ఫిరౌన్ తన సభికులను హజ్రత్ మూసా(అలై) దైవప్రవక్త కాదు అని నమ్మించడానికి ఇలా అన్నాడు :

> "ఇతనిపై బంగారు కంకణాలు ఎందుకు దించబడలేదు? దైవదూతల బృందం, పరిచారకులుగా ఇతని వెంట ఎందుకు రాలేదు?"
>
> *(అజ్‌జుఖ్‌రుఫ్ : 53)*

అల్లాహ్, దైవదూతల గురించి తెలియని వ్యక్తి గురించి ఇలాంటి మాటలు ఎలా మాట్లాడగలడు!?

మరో సందర్భంలో ఫిరౌన్– హ(జత్ మూసా(అలై)ల మధ్య జరిగిన సంభాషణ ఇలా వుంది.

ఫిరౌన్ రాజు మూసా(అలై)తో ఇలా అన్నాడు; 'మూసా! నీవు నిశ్చయంగా మంత్రజాలానికి గురైన మనిషివని నేను భావిస్తున్నాను'. దానికి సమాధానంగా మూసా ఇలా అన్నాడు: 'నీకు బాగా తెలుసు. గుణపాఠం నేర్పే ఈ నిదర్శనాలను భూమ్యాకాశాల ప్రభువు తప్ప మరెవ్వడూ అవతరింపజెయ్యలేదు. ఫిరౌన్! నీవు నిశ్చయంగా శాపానికి గురైనవాడవు అని నేను భావిస్తున్నాను'.

*(బనీ ఇస్రాయీల్ : 101– 102)*

మరోచోట ఫిరౌనీయుల మానసిక స్థితిని గురించి అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

"కాని, స్పష్టమైన మా సూచనలు వారి ముందుకు వచ్చినప్పుడు, వారు 'ఇది స్పష్టమైన మాయాజాలమే'అని అన్నారు. వారు అన్యాయంగా అహంకారంతో ఆ సూచనలను తిరస్కరించారు" అయితే వారి హృదయాలు మట్టుకు వాటిని అంగీకరించాయి. *(అన్‌నమ్ల్ : 13)*

మరో సమావేశ సన్నివేశాన్ని ఖుర్‌ఆన్ ఇలా చిత్రీకరించింది–

మూసా వారితో ఇలా అన్నాడు, 'దౌర్భాగ్యులారా! అల్లాహ్‌పై అపనిందలు మోపకండి. అలా చేస్తే ఆయన మిమ్మల్ని ఒక కఠినశిక్ష ద్వారా సర్వ నాశనం చేస్తాడు. అబద్ధాన్ని ఎవడు కల్పించినా, వాడు విఫలుడే అయ్యాడు'. ఇది విన్న తరువాత వారి మధ్య అభిప్రాయ భేదం తలెత్తింది. వారు తమలో తాము రహస్యంగా సంప్రదించుకో సాగారు. చివరకు కొందరు ఇలా అన్నారు, 'ఈ ఇద్దరు కేవలం మాంత్రికులే, వారి ఉద్దేశం తమ మంత్రబలం ద్వారా మిమ్మల్ని మీ దేశం నుండి తరిమివేయడం. అంతేకాదు, మీ ఆదర్శ జీవన విధానాన్ని అంతమొందించటం'. *(తాహా 20: 61–63)*

వాస్తవమేమిటంటే, దైవశిక్ష, దైవానికి అబద్ధాలను ఆపాదించటం వంటి దౌష్ట్యాల పర్యవసానాన్ని గురించి హెచ్చరించినప్పుడు వారిలో కలవరం, కలకలం కలగటానికి కారణం; వారి హృదయాలలో దేవుని పట్ల ఔన్నత్యం, భయం కాస్తోకూస్తో మిగిలి వుండటమే. కాని వారి జాత్యాహంకార పాలక వర్గం రాబోయే రాజకీయ విప్లవ ప్రమాదాన్ని పసిగట్టి ఇలా అన్నారు, “ఒకవేళ మనం గనుక మూసా, హారూన్‌ల మాటలు నమ్మినట్లయితే మనపై (ఈజిప్టియన్లపై) బనీ ఇస్రాయీల్ పెత్తనం మళ్ళీ మొదలవుతుంది.” అందుకే వారి హృదయాలు మొద్దుబారిపోయాయి. ఎట్టకేలకు వారంతా ప్రవక్తలను వ్యతిరేకించాలని నిర్ణయించుకున్నారు.

ఈ వాస్తవాన్ని తెలుసుకున్నాక ఫిరౌన్, హజ్రత్ మూసా(అలై)ల మధ్య సంఘర్షణకు మూల కారణం ఏమిటో స్పష్టంగా అర్థమయివుండాలి. ఫిరౌన్, ఆయన జాతివారు ఎలాంటి మార్గభ్రష్టతకు గురయ్యారో కూడా తెలుస్తుంది. ఫిరౌన్ ఏ భావనతో దైవత్వపు ప్రభుత్వాధికారంలో ఏవిధంగా భాగస్వామిననుకుంటున్నాడో కూడా అర్థమవుతుంది. ఈ విషయాలనే మరింత వివరంగా తెలుసుకోవడానికి ఖుర్ఆన్‌లోని ఈ క్రింది వాక్యాలను పరిశీలిద్దాం.

ఒక సందర్భంలో ఫిరౌన్ సభికులలో కొందరు హజ్రత్ మూసా (అలై) సందేశాన్ని వ్యతిరేకిస్తూ ఫిరౌన్‌నుద్దేశించి ఇలా అన్నారు:

> “మూసాను, అతని జాతివారినీ రాజ్యంలో కల్లోలం వ్యాపింపజేయడానికీ, వారు నీ దాస్యాన్ని నీ దేవుళ్ళ దాస్యాన్నీ కాదనటానికి నీవు వారిని స్వేచ్ఛగా వదలిపెడతావా?” *(ఆరాఫ్ : 127)*

రెండో వైపు ఈ సభికులలో నుండే హజ్రత్ మూసా(అలై)ను విశ్వసించిన ఒక వ్యక్తి వారితో ఇలా అన్నాడు:

"నేను అల్లాహ్‌ను తిరస్కరించాలనీ, నేను ఎరుగని శక్తులను ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టాలనీ, మీరు నాకు పిలుపు ఇస్తున్నారు".
*(అల్‌మూ'మీన్ : 40:42)*

పై రెండు ఖుర్‌ఆన్ ఆయత్‌లను (వాక్యాలను), నేడు మనకు లభించే ఆనాటి ఈజిప్టువాసుల చరిత్రను కలిపి చూసినట్లయితే ముందుగా వివరించిన మొదటి, రెండవ భావాల ప్రకారం స్వయంగా ఫిరౌన్ చక్రవర్తులు మరియు వారి జాతి జనులు కూడా దైవభావనను కలిగివుండి, వారిని నిజదైవానికి భాగస్వాములుగా నిలబెట్టి, వారిని ఆరాధించేవారని తెలుస్తుంది. ఫిరౌన్ గనక సమజభావంలో తనను దైవంగా ప్రకటించుకుని వుంటే, సమస్త కారకాలపై తనకు గుత్తాధిపత్యం ఉందని నిజంగా చెప్పిఉంటే, తాను తప్ప వేరొక భూమ్యాకాశాల ప్రభువు లేనేలేడన్నదే అతని వాదన అయివుంటే అతడు ఇతరత్రా చిల్లర దేవుళ్ళకు మొక్కేవాడే కాదు.

ఖుర్‌ఆన్‌లో ప్రస్తావించబడిన ఫిరౌన్ యొక్క ఈ క్రింది మాటలు చూడండి.

"ప్రజలారా! నేనుకాక మీకు మరొక దేవుడెవడైనా ఉన్నాడేమో నేను ఎరుగను" *(అల్ ఖసస్ : 38)*

"ఓ మూసా! 'నీవు నన్ను కాదని మరెవరినైనా ఆరాధ్యునిగా చేసుకుంటే, నిన్ను కూడా జైళ్ళల్లో పడి మ్రగ్గిపోతున్నవారిలో చేరుస్తాను."
*(అష్ షుఅరా : 29)*

దీని అర్థం ఫిరౌన్ తాను తప్ప ఇతరత్రా దైవాలందరినీ తిరస్కరిస్తు న్నాడని కాదు. దీని అసలు ఉద్దేశ్యం, హజ్రత్ మూసా(అలై) సందేశాన్ని వ్యతిరేకించడమే. ఎందుకంటే హజ్రత్ మూసా(అలై) ఏ దేవుని వైపు ఆహ్వా నిస్తున్నాడో ఆయన కేవలం సర్వసత్తాక ప్రభువే కాదు. ఆయన రాజకీయ, ఆర్థిక, సామాజిక సకల రంగాలకు స్వామి మరియు వాటిపై పూర్తి అధికారం

గలవాడు. అందుకే ఫిరౌన్ తన ప్రజలతో ఇలా అన్నాడు. "అలాంటి అధికారం గల ప్రభువు (రాజు) నేను తప్ప మరెవరున్నారు?" ఒకవేళ ఇలాంటి భావనలతో నన్ను తప్ప మరెవరినైనా దేవునిగా భావిస్తున్నట్లయితే నిన్ను జైలులో పడేయిస్తాను" అని మూసా(అలై)ను బెదిరించాడు.

ఖుర్ఆన్ వాక్యాలను మరియు చారిత్రక ఆధారాలను పరిశీలిస్తే తెలిసిందేమిటంటే, ఈజిప్టు చక్రవర్తులు కేవలం నిరపేక్ష సార్వభౌమత్వం (Absolute Sovereintly)తోనే సరిపుచ్చుకోక ఆనాటి దేవీదేవతలతో కూడా సంబంధాలు కలిగి ఉన్నవారమని వాదించేవారు. ఆవిధంగా వారు దైవాంశసంభూతులమని నమ్మబలికి, ఒకింత పవిత్రతను ఆపాదించుకున్నారు. ఎందుకంటే తమ పాలనలో ఉన్న ప్రజలపై మరింత పట్టు కలిగి ఉండటానికి ఇలా చేసేవారు.

ఫిరౌన్ ఒక్కడే ఇలాంటి వాదన చేయలేదు. ప్రపంచంలోని అనేక రాజవంశాలలో చాలా మంది రాజులు అధికార ఆధిపత్యమేకాక దైవత్వంలో తాము కూడా కాస్తోకూస్తో భాగస్తులు కావాలని ఆరాటపడేవారు. కనుకనే తమ ప్రజలను పూజా పునస్కారాలలో వారిని కూడా భాగస్వాములుగా చేయాలని ఆదేశించేవారు. వాస్తవానికి ఇదొక పాక్షిక విషయం. దీని అసలు ఉద్దేశ్యం రాజ్యాధికార సుస్థిరత. దీని కోసం సర్వసత్తాక ప్రభువును అన్నవారి వాదన కేవలం ఒక ఢాలుగా ఉపయోగించిన సాధనం తప్ప మరేమీ కాదు. అందుకే ఈజిప్టుతో సహా అజ్ఞాన మూఢాచారాలు గల అనేక రాజ్యాలలో రాచరికాలు మారిన ప్రతిసారీ వారి రాజరికంతోపాటు వారి వంశారాధన కూడా అంతమైపోయేది. సింహాసనం చేజిక్కినవారి చేతుల్లోకి మతాచారాలు కూడా బదిలీ అయ్యేవి.

3. ఫిరౌన్ వాదన కూడా వాస్తవానికి తానే 'సర్వసత్తాక ప్రభువు' అన్నది కేవలం రాజకీయాధికార భావనతో మాత్రమే. దైవత్వపు మూడవ, నాలుగవ,

ఐదవ భావనలో నేనే ఈజిప్టు రాజ్యం మరియు దానిలోని ప్రజలకు ప్రభువు (Lord)ను అన్నదే ఆయన వాదన. నా అధీనంలో ఉన్న ఈ రాజ్యంలో సకల సౌకర్యాలను కల్పించగల అధిపతిని నేనే. ఇక్కడ కేవలం నా అధికారం, ఆజ్ఞలు మాత్రమే చెల్లుబాటు అవుతాయి. ఇక్కడి సామాజిక, పౌర జీవన విధానానికి కేంద్రబిందువును నేనే. ఇక్కడ నా శాసనమే శిరోధార్యం కావాలి అన్నది ఆయన వాదన. ఆయన ఈ వాదనకు అసలు కారణం ఖుర్‌ఆన్ భాషలోనే చూద్దాం–

ఒకరోజు ఫిరౌన్ తన జాతివారి మధ్యకు పోయి ఇలా ప్రకటించాడు– "ప్రజలారా! ఈజిప్టు సామ్రాజ్యం నాది కాదా, ఈ కాలువలు నా క్రింద ప్రవహించటం లేదా? మీకు కనిపించటం లేదా"

*(అజ్ జుఖ్‌రుఫ్– 51)*

ఇలాంటి వాదననే నమ్రూద్ కూడా చేశాడు :

"ఇబ్రాహీం ప్రభువు ఎవరు అనే విషయంపై అతనితో వివాదపడిన వ్యక్తి (నమ్రూద్) విషయాన్ని గురించి నీవు ఆలోచించలేదా? అల్లాహ్ ఆ వ్యక్తికి రాజ్యాధికారం ఇవ్వటం వల్ల ఈ వివాదం తలెత్తింది."

*(2 : 258)*

ఈ కారణంగానే యూసుఫ్(అలై)కు సమకాలికుడైన ఫిరౌన్ చక్రవర్తి కూడా తన సామ్రాజ్యంలో 'ప్రభువు'గా వర్థిల్లేవాడు.

4. అల్లాహ్ మాత్రమే సకల లోకాల ప్రభువు, ఆయన తప్ప మరెవ్వరూ ఏ భావంలోనూ దేవుడు లేక ప్రభువు కాదు' అన్న మూసా (అలై) సందేశ ప్రచార పిలుపే మూసా(అలై)కు ఫిరౌన్, ఫిరౌన్ వంశీయులకు మధ్య వైరానికి అసలు కారణం. "అల్లాహ్‌యే సర్వసత్తాక ప్రభువు, సామూహిక, రాజకీయ పరిభాషలో కూడా ఆయన ఒక్కడే ప్రభువు. అందరూ ఆయననే పూజించాలి. ఆరాధనకు, విధేయతకు ఆయన మాత్రమే అర్హుడు. అందరూ ఆయన శాసనానికే కట్టుబడి ఉండాలి. ఆయనే నన్ను (హజ్రత్ మూసా(అలై)ను) అన్ని

నిదర్శనాలతో తన ప్రతినిధిగా చేసి పంపాడు. నా ద్వారా మానవాళికి అవసర మైన మార్గదర్శక సూత్రాలు తెలియజేస్తాడు. కనుక ఆయన దాసులపై అధికారం మీ చేతులలోకాక నా చేతుల్లో ఉండాలి" అన్న మూసా(అలై) సందే శాన్ని విని ఫిరౌన్, ఆయన అధికారులు 'ఈ ఇద్దరు సోదరులు మమ్మల్ని ఈ భూమిపై నిలువ నీడలేకుండా చేసి, వీరే పాలకులు కావాలని చూస్తున్నారు.' మా రాజ్యంలోని మతవ్యవస్థను, సాంఘిక ఆచార వ్యవహారాలన్నింటినీ నామ రూపాలు లేకుండా చేసి తమ దైన వ్యవస్థను నెలకొల్పాలని చూస్తున్నారని కూడా అనేవారు.

"మేము మూసాను మా సూచనలతో స్పష్టమైన నియామకపు ఉత్తర్వు లతో ఫిరౌన్ వద్దకు, అతని రాజ్యాధికారుల వద్దకు పంపాము. కాని వారు (ఈజిప్టు వాసులు) ఫిరౌన్ ఆజ్ఞను అనుసరించారు. వాస్తవానికి ఫిరౌన్ ఆజ్ఞ న్యాయమైనది కాదు." *(హూద్ 11 : 96,97)*

మేము వారికి పూర్వం, ఫిరౌన్ జాతి వారిని ఇటువంటి పరీక్షకే గురి చేశాము. వారి వద్దకు ఎంతో మర్యాదస్థుడైన ఒక ప్రవక్త వచ్చాడు. అతను ఇలా అన్నాడు: "అల్లాహ్ సేవకులను నాకు అప్పగించండి. నేను మీ కొరకు వచ్చిన ఒక నమ్మకస్తుడనైన ప్రవక్తను. అల్లాహ్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయకండి. నేను మీ ముందు (నా నియామ కానికి సంబంధించిన) స్పష్టమైన ప్రమాణాన్ని ఉంచుతున్నాను."

*(44 : 17-19)*

"మేము (అల్లాహ్) ఫిరౌన్ వద్దకు ఒక ప్రవక్తను పంపిన విధంగా ఒక ప్రవక్తను మీపై సాక్షిగా నియమించి మీ వద్దకు పంపాము. (చూడండి) ఫిరౌన్ ఆ ప్రవక్త మాటను వినకపోవటం వల్ల మేము అతన్ని చాలా తీవ్రంగా పట్టుకున్నాము." *(అల్ ముజ్జమ్మిల్ 73 : 15,16)*

ఫిరౌన్ ఇలా ప్రశ్నించాడు : 'అది సరేగాని మూసా! ఇంతకీ మీ ఇద్దరి

ప్రభువు ఎవడు?' అని అడిగాడు. దానికి మూసా 'ప్రతి వస్తువుకూ దాని స్వరూపాన్ని ప్రసాదించి, తరువాత దానికి మార్గం చూపినవాడే మా ప్రభువు' అని జవాబు చెప్పాడు. *(తాహా : 49,50)*

"ఫిరౌన్ ఇలా అన్నాడు, 'ఈ సకల లోకాల ప్రభువు ఏమిటి?' దానికి మూసా, 'ఆకాశాలకూ, భూమికీ ప్రభువు. భూమ్యాకాశాల మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు, నీవు (దేవుణ్ణి) నమ్మేవాడివే అయితే' అని జవాబు చెప్పాడు. ఫిరౌన్ తన చుట్టూ ఉన్న వారితో 'వింటున్నారా?' అని అన్నాడు. మూసా ఇలా అన్నాడు, 'ఆయనే మీ ప్రభువు కూడా పూర్వం గతించిన మీ తాత ముత్తాతల ప్రభువు కూడా'. ఫిరౌన్ (అక్కడి వారితో) ఇలా అన్నాడు: 'మీ వద్దకు పంపబడిన మీ దైవప్రవక్త గారు పూర్తిగా పిచ్చివారుగా కనిపిస్తున్నారు'. మూసా ఇంకా ఇలా అన్నాడు: 'తూర్పుకూ, పడమరకూ, వాటి మధ్య ఉన్న సర్వానికి ప్రభువు, మీరు వివేకం కలవారే అయితే'. ఫిరౌన్ ఇలా అన్నాడు, 'నీవు నన్ను కాదని మరెవరినైనా ఆరాధ్యుడిగా చేసుకుంటే, నిన్ను కూడా జైళ్ళల్లో పడి మ్రగ్గిపోతున్నవారిలో చేరుస్తాను." *(అష్ షుఅరా : 23-29)*

ఫిరౌన్ ఇలా అన్నాడు : 'మూసా! నీవు నీ మంత్రజాల శక్తితో మమ్మల్ని మా దేశం నుండి వెళ్ళగొట్టటానికి మా వద్దకు వచ్చావా?"

*(తాహా 20 : 57)*

ఫిరౌన్ తన దర్బారు జనులతో ఇలా అన్నాడు: "నన్ను వదలండి, నేను ఈ మూసాను చంపివేస్తాను. ఇతడు తన ప్రభువును పిలుచుకోనివ్వండి. ఇతడు మీ మతాన్ని మార్చివేస్తాడేమో అని లేదా దేశంలో సంక్షోభాన్ని రేకెత్తిస్తాడేమో అని నేను భయపడుతున్నాను."

*(అల్ మూ'మిన్ : 26)*

వారిలో కొందరు ఇలా అన్నారు, "ఈ ఇద్దరు కేవలం మాంత్రికులే. వారి ఉద్దేశ్యం తమ మంత్రబలం ద్వారా మిమ్మల్ని మీ దేశం నుండి తరిమివేయటం. అంతేకాదు, మీ ఆదర్శ జీవన విధానాన్ని అంతమొందించటం". *(తాహా : 63)*

పై వాక్యాలన్నింటినీ వరుసగా పరిశీలిస్తే స్పష్టంగా అర్థమయ్యే విషయమేమంటే, ప్రపంచంలోని వివిధ జాతులలో ఆది నుండి దేవుని పాలనా వ్యవస్థ విషయంలో ఒకే విధమైన అజ్ఞాన భావన సాగుతూ వస్తుంది. నైలు (ఈజిప్టు) గడ్డపై అలుముకున్న గాడాంధకారం కూడా ఇదే. మొదటి నుండి ప్రతి ప్రవక్త దీనికి వ్యతరేకంగా ఇచ్చిన పిలుపు ఒక్కటే, 'ఈ అఖండ బ్రహ్మాండమైన సృష్టికి దేవుడు ఒక్కడే ఆయనే ప్రభువు. ఈ విశ్వవ్యవస్థలో ఆధిక్యత కేవలం ఆయనకే చెందాలి' ఇదే పిలుపును మూసా మరియు హారూన్ సోదరులు కూడా ఇచ్చారు.

## యూదులు, క్రైస్తవులు

ఫిరౌన్ జనుల తరువాత మనముందు యూద మతాన్ని మరియు క్రైస్తవ మతాన్ని అనుసరించిన బనీఇస్రాయీలు జాతులవారు వస్తారు. వీరు అల్లాహ్ ఉనికిని, ఔన్నత్యాన్ని గురించి తెలియనివారని లేదా ఆయన దేవుడు, ప్రభువు కాదు అని భావించేవారన్న అనుమానమే రాదు. స్వయంగా ఖుర్ఆన్ వారిని గ్రంథవహులని ధృవీకరించింది మరి ఎందుకు? ప్రభువు పాలనా వ్యవస్థ విషయంలో ఖుర్ఆన్, వారి నమ్మకాన్ని, ఆచరణాశైలిని చూసి మార్గభ్రష్టతకు గురైన వర్గంగా పేర్కొన్నది అంటే దానికి సమాధానం స్వయంగా ఖుర్ఆనే ఇలా చెబుతుంది.

ఇలా చెప్పు, "గ్రంథ ప్రజలారా! మీ ధర్మం విషయంలో అన్యాయంగా హద్దులు మీరి ప్రవర్తించకండి. మీకు పూర్వం, స్వయంగా తామూ మార్గభ్రష్టులై ఇంకా చాలా మందిని మార్గభ్రష్టులుగా చేసి రుజుమార్గం తప్పినవారి ఊహాగానాలను అనుసరించకండి." *(అల్ మాయిద : 77)*

దీన్నిబట్టి అర్థమయ్యేదేమిటంటే, పూర్వపు జాతులు ఏవిధమైన మార్గభ్రష్టతకు లోనై ఉండేవో సరిగ్గా అలాంటి మార్గభ్రష్టతకే యూదులు, క్రైస్తవులు కూడా లోనై ఉన్నారని తెలుస్తుంది. వారిలో ఈ మార్గభ్రష్టత తమ మతావలంబనలో అతిశయిల్లటం వల్ల వచ్చింది. దీని పూర్తి వివరణ ఖుర్ఆన్ ఈ క్రింది వాక్యాలలో ఎలా ఎత్తిచూపుతుందో ఒకసారి గమనించండి :-

'ఉజైర్ అల్లాహ్ కుమారుడు'అని యూదులు అంటారు. 'మసీహ్ (ఏసుక్రీస్తు) అల్లాహ్ కుమారుడు'అని క్రైస్తవులు అంటారు. *(తౌబా : 30)*

'మర్యమ్ కుమారుడైన మసీహ్‌యే అల్లాహ్' అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడినట్లే. వాస్తవానికి మసీహ్ ఇలా అన్నాడు; 'ఇస్రాయీల్ వంశీయులారా! అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఆయన నాకూ ప్రభువే. మీకూ ప్రభువే.' *(అల్ మాయిద : 72)*

"అల్లాహ్ ముగ్గురిలో ఒకడు" అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడినవారు. వాస్తవమేమిటంటే, దేవుడు ఒక్కడే. మరొక దేవుడు లేడు. *(అల్ మాయిదా : 73)*

"ఓ మర్యమ్ కుమారుడవైన ఈసా! నీవు మానవ జాతితో, అల్లాహ్‌ను కాదని నన్నూ, నా తల్లిని దేవుళ్ళుగా భావించండి అని బోధించావా?" అని అల్లాహ్ అడిగినప్పుడు అతను ఇలా మనవి చేసుకుంటాడు, 'నీవు అత్యంత పవిత్రుడవు! ఏ మాటను అనే హక్కు నాకు లేదో ఆ మాటను అనటం నాకు యుక్తమైన పనికాదు. *(అల్‌మాయిదా : 116)*

ఏ వ్యక్తికైనా అల్లాహ్ గ్రంథాన్ని, వివేకాన్ని, ప్రవక్త పదవిని ప్రసాదిస్తే, అతడు ప్రజలతో 'మీరు అల్లాహ్‌కు బదులుగా నాకు దాసులుకండి'అని అనటం తగదు. అతడు ఇదే అంటాడు: "మీరు ఇతరులకు బోధించే

టటువంటి, స్వయంగా చదివేటటువంటి గ్రంథంలోని ఉపదేశాలు కోరేవిధంగా నిజమైన 'రబ్బానీ'లు (ప్రభువు వారలు) అవండి. దైవదూతలనో లేక ప్రవక్తలనో ప్రభువులుగా చేసుకోండి అని ఏ ప్రవక్తా మిమ్మల్ని ఆదేశించడు. ముస్లిములయిన మీకు ఒక ప్రవక్త అవిశ్వాసాన్ని అవలంబించండి అని ఆదేశించటం సాధ్యమా?

*(ఆలిఇమ్రాన్ : 79-80)*

పై వాక్యాల ద్వారా తెలిసిందేమిటంటే, గ్రంథవహుల మొట్టమొదటి మార్గభ్రష్టత ఏమిటంటే, వారు తమలోని మహాపురుషులను, దైవప్రవక్తలను, సజ్జనులను, దూతలు మొదలైన వారందరినీ ధార్మికంగా మహోన్నతులుగా, గౌరవమర్యాదలకు అర్హులుగా భావించేవారు. వారిని వారి అసలు స్థానం నుంచి తొలగించి దేవుని దరిదాపుల స్థానం వరకు చేర్చివేశారు. ఇంకా వారిని దైవిక కార్యకలాపాలలో ప్రమేయమున్న భాగస్వాములుగా భావించి వారిని పూజించేవారు. వారిని వేడుకునే వారు కూడా. ఇంకా దేవుని సర్వసత్తాకాధికారంలో, దైవత్వంలో వారిని వాటాదారులుగా భావించేవారు. తమ తప్పులను క్షమింపజేసేవారని, తమకు సహాయపడేవారిగా, తమని కనిపెట్టుకొని ఉండే శక్తిసామర్థ్యాలు గలవారిగా తలపోశారు.

ఇక వారి రెండవ మార్గవిహీనత ఏమిటంటే,

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు." *(తౌబా : 31)*

వాస్తవానికి ధర్మసంబంధమైన విషయంలో వారి స్థానం కేవలం దేవుని ఆదేశాలను, ఆజ్ఞలను తెలియజేయడం, ఇంకా దేవుని అభీష్టం ప్రకారం రం నైతిక ప్రక్షాళన గావించడమే. కాని మెల్లమెల్లగా వారే స్వంత నిర్ణయాలు తీసుకునే స్థాయికి ఎదిగి దేన్నిపడితే దాన్ని ఆదర్శమైనదిగా, దేన్నిపడితే దాన్ని ధర్మసమ్మతమైనదిగా చేసివేసేవారు. చివరికి దైవగ్రంథాలతో నిమిత్తం లేకుండా

ఆదేశాలను జారీచేసేవారు. తమకు నచ్చని విషయాన్ని రద్దుచేసేవారు. తమకిష్టమైన కొత్త సంప్రదాయాన్ని ప్రవేశపెట్టే స్థాయికి చేరుకున్నారు. ఈ విధంగా వీరు చివరికి నూహ్, ఇబ్రాహీం, ఆద్, సమూద్, మద్‌యన్ తదితర జాతులవారు ఏ మార్గభ్రష్టతలకు గురయ్యారో అలాంటి మార్గభ్రష్టతకే వీరు కూడా గురయ్యారు. వారి లాగానే వీరు కూడా దేవుని సర్వసత్తాక ప్రభుత్వాధిపత్యంలో, దైవత్వంలో దూతలను, వారి తాతముత్తాతలను భాగస్వాములుగా చేసివేశారు. ఇంకా వారిలాగానే సంస్కృతీ నాగరికతలలో, రాజకీయ, సామాజిక, నైతిక వ్యవహారాలలో దైవ నిబంధనలను, సూత్రాలను కాదని మానవుల మార్గదర్శక ఆదేశాలను అనుసరించడం మొదలుపెట్టారు. చివరికి పరిస్థితి ఎంతదాకా వచ్చిందంటే,

> "గ్రంథ జ్ఞానంలో కొంతభాగం ఇవ్వబడిన వారిని నీవు చూడలేదా? వారి పరిస్థితి ఎలావుందంటే, వారు 'జిబ్త్'ను, 'తాగూత్'ను నమ్ముతారు". *(అన్ నిసా : 51)*

> ఇంకా ఇలా చెప్పు: "అల్లాహ్ వద్ద ఎవరి ముగింపు అవిధేయుల ముగింపుకంటే కూడా హీనతరంగా ఉంటుందో వారిని గురించి తెలియజేయనా? వారు అల్లాహ్ శాపగ్రస్తులు, వారిపై ఆయన ఆగ్రహం విరుచుకుపడింది. వారు కోతులుగా, పందులుగా చెయ్యబడ్డారు. వారు తాగూత్ దాస్యం చేశారు. వారు ఎంతో అధ్వాన్నస్థితిలో ఉన్నారు. వారు రుజుమార్గం తప్పి బహుదూరం పోయారు." *(అల్ మాయిదా : 60)*

అన్ని రకాల దురాచారాల, మూఢనమ్మకాల సమగ్ర పదరూపమే 'జిబ్త్'. ఇందులో మంత్ర తంత్రాలు, చేతబడి, జ్యోతిష్యం, భూతవైద్యం, సోది, శకునాలు, ముహూర్తాలు ఇంకా ఇతర అపోహలకు సంబంధించిన అన్ని విషయాలు ఇమిడి ఉన్నాయి. అలాగే 'తాగూత్' అనగా దైవాదేశాలకు

వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం, పెడసరి పోకడను అవలంబించటం, దైవద్రోహానికి ఒడిగట్టే ప్రతి వ్యక్తిని లేక జాతులను లేక సంస్థలను తాగూత్ అంటారు. దైవదాస్యపు హద్దులను అతిక్రమించి దైవాదేశాలను అతిగా చేసి చూపడాన్ని కూడా తాగూత్ అంటారు. ఈ రెండు రకాల అపమార్గానికి యూదులు, క్రైస్తవులు గురై ఉన్నారు. మొదటి మార్గభ్రష్టత కారణంగా మెల్ల మెల్లగా అన్నిరకాల అనుమానాలు, సంశయాలు వారి హృదయాలలో, వారి మస్తిష్కాలలో తిష్ఠవేసుకొని కూర్చున్నాయి. రెండవ మార్గభ్రష్టత ఫలితంగా వారు తమ పండితుల, సన్యాసుల, మతాచార్యుల దాస్యాన్ని కూడా మించి పోయి నిజ దైవంపై తిరుగుబాటు చేసిన దుర్మార్గుల, విద్రోహుల ఊడిగం చేయటం మొదలెట్టారు.

## అరబ్బు బహు దైవారాధకులు

ఏ జాతిని సంస్కరించడానికి అంతిమ దైవప్రవక్త ముహమ్మద్(స) ప్రభవింపజేయబడ్డారో, మొట్టమొదట ఖుర్‌ఆన్ ఎవరినైతే సంబోధించిందో ఆ అరబ్బు బహుదైవారాధకుల గురించి ఇప్పుడు మనం తెలుసుకుందాం. ఈ విషయంలో వారి అపమార్గం ఏ కోవకు చెందినది? వారు అల్లాహ్‌ను దేవునిగా, ప్రభువుగా అంగీకరించేవారు కాదా? వారిని నిజదైవం దైవత్వాన్ని, ప్రభూధికారాన్ని, విధేయతను అంగీకరింపజేయటానికే ఖుర్‌ఆన్ అవతరించిందా? లాత్, మన్నాత్, ఉజ్జాయ్, హుబల్ మరియు వారు ఆరాధించే ఇతర దేవతలే వాస్తవానికి ఈ విశ్వానికి ప్రభువులు, యజమానులు, పరిపోషకులు, సర్వసత్తాక ప్రభువులని వారు భావించేవారా? లేక వారు తమ ఆరాధ్యులనే శాసనప్రదాతలుగా, నైతిక, సామాజిక సమస్యల పరిష్కారం చూపి మార్గదర్శకత్వం వహించేవారని భావించేవారా? వీటిలో ఒక్కొక్కదానికి 'లేదు, లేదు' అన్న సమాధానం ఖుర్‌ఆన్ ద్వారా మనకు లభిస్తుంది. ఖుర్‌ఆన్ ద్వారా మనకు తెలిసేదేమిటంటే, ఈ అరబ్బు బహుదైవారాధకులు అల్లాహ్‌ను విశ్వసించేవారు.

ఈ విశ్వవ్యవస్థకే కాక తాము ఆరాధించే దేవతలకు కూడా సృష్టికర్త ఆయనే అని నమ్మేవారు. ఆయననే దేవుడు, ప్రభువు అని విశ్వసించేవారు. కష్ట కాలంలో, ఆపదల సమయంలో తప్పించుకునే మార్గాలన్నీ మూసుకొని పోయినప్పుడు చివరికి వేడుకునేది కూడా అల్లాహ్‌నే. వారు అల్లాహ్ ఆరాధ నను, పూజను నిరాకరించేవారు కూడా కాదు. తమ దేవతలే ఈ విశ్వవ్యవస్థకు యజమానులని లేక పరిపోషకులని కూడా వారు భావించేవారు కాదు.

ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాలే వీటికి సాక్ష్యాలు :

> "ఓ ప్రవక్తా! వారిని ఇలా అడుగు. మీకు తెలిస్తే చెప్పండి : ఈ భూమి, దానిలోని ప్రాణులన్నీ ఎవరివో?' వారు తప్పకుండా 'అల్లాహ్‌కు చెందుతాయి' అని అంటారు. 'అలాంటప్పుడు మీరు ఈ విషయాన్ని ఎందుకు అర్థం చేసుకోరు?'అని అను. వారిని ఇంకా ఇలా అడుగు: 'సప్తాకాశాలకూ, మహోన్నతమైన పీఠానికీ ప్రభువు ఎవరు?' వారు తప్పకుండా, 'అల్లాహ్' అని అంటారు. 'అలాంటప్పుడు మీరు ఎందుకు ఆయనకు భయపడరు' అని అను. వారితో ఇంకా ఇలా అను, మీరు గనుక ఎరిగి ఉంటే చెప్పండి, ప్రతిదానిపై ఆధిపత్యం ఎవరికున్నదో? ఇంకా శరణు ఇచ్చేవాడెవడో చెప్పండి? ఆయనకు ప్రతిగా శరణు ఇచ్చేవాడెవ్వడూ లేడు, వారు తప్పకుండా, 'ఈ శక్తిగలవాడు అల్లాహ్‌యే' అని అంటారు. 'అలాంటప్పుడు మీరు ఎలా మోస పోతున్నారు?'అని అను. సత్యవిషయాన్ని మేము వారి ముందుకు తీసుకువచ్చాము. వారు అబద్ధం చెప్పేవారు అనటంలో ఏమాత్రం సందేహంలేదు." *(అల్‌మూ'మినూన్ : 84-90)*
>
> మిమ్మల్ని నేలపైనా నీటిపైనా నడిపేవాడు అల్లాహ్‌యే. కాబట్టి మీరు ఓడలపై ఎక్కి వాయువులు అనుకూలంగా వీస్తూ ఉండగా ఆనందంగా, ఆహ్లాదంగా ప్రయాణం చేస్తూ ఉంటారు. ఆ తరువాత అకస్మాత్తుగా

ఎదురుగాలి ఉధృతమై అన్ని దిశల నుండి అలల దెబ్బలు తగలగా ప్రయాణీకులు తాము తుఫానులో చిక్కుకుపోయామని తెలుసు కుంటారు. ఆ సమయంలో అందరూ తమ ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం చేసుకొని ఆయనను ఇలా వేడుకుంటారు: "నీవు గనుక మాకు ఈ ఆపద నుండి విముక్తి కలిగిస్తే మేము కృతజ్ఞతలు తెలుపుకునే దాసులమవుతాము". కాని ఆయన వారిని రక్షించిన తరువాత వారే సత్యానికి విముఖులై భూతలంపై తిరుగుబాటు చేస్తారు.

*(యూనుస్ : 22, 23)*

"సముద్రంలో మీకేదన్నా ఆపద కలిగినప్పుడు ఆయన ఒక్కడు తప్ప మీరు పిలిచేవారంతా మాటమాయమైపోతారు. కాని ఆయన మిమ్మల్ని రక్షించి నేలపైకి చేర్చినప్పుడు మీరు ఆయన నుండి ముఖం తిప్పు కుంటారు. మానవుడు నిజంగా చాలా కృతఘ్నుడు".

*(బనీ ఇస్రాయీల్ 17: 67)*

తమ ఆరాధ్య దైవాల పట్ల వారి భావన ఎలా వుండేదో వారి మాటల లోనే ఖుర్‌ఆన్ తెలియజేస్తున్న వాక్యాలను చూడండి :

"ఇక అల్లాహ్‌ను వదిలివేసి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నవారు, (తమ ఈ చర్య కారణంగా) "వారు మమ్మల్ని అల్లాహ్ వద్దకు చేరుస్తారని మాత్రమే మేము వారిని ఆరాధిస్తున్నాము" అని అంటారు.

*(అజ్ జుమర్ 39: 3)*

పైగా వారు ఇలా అంటున్నారు; "వారు అల్లాహ్ వద్ద మా కొరకు సిఫారసు చేస్తారు." *(యూనుస్ : 10: 18)*

ఇంకా తమ జీవిత సమస్యలకు పరిష్కారం తాము ఆరాధించే దేవతలు చూపుతారని వారు భావించేవారు. కనుక అల్లాహ్ యూనుస్ సూరాలో ప్రవక్త(స)కు ఇలా ఆదేశిస్తున్నాడు:

> వారిని ఇలా అడుగు: 'మీరు అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన వారిలో సత్యం వైపునకు మార్గం చూపేవాడు కూడా ఎవడైనా ఉన్నాడా?' (యూనుస్ 10 : 35)

కాని ఈ ప్రశ్నలు విని వారు మౌనం వహించారు. వారిలో ఏ ఒక్కరు కూడా లాత్, మనాత్ లేక ఉజ్జా లేక ఏ ఇతర దేవతలు తమకు ఆలోచనాత్మక, ఆచరణాత్మక రుజుమార్గం చూపుతారని సమాధానం ఇవ్వలేదు. జీవితంలో న్యాయాన్ని, ధర్మాన్ని అనుసరించే సన్మార్గం చూపి ప్రశాంతతను కల్పిస్తారని, ఇంకా వారి జ్ఞానకాంతుల వల్ల ఈ సృష్టి నిగూఢ రహస్యాలు తెలుస్తాయని కూడా సమాధానం ఇవ్వలేదు. అప్పుడు అల్లాహ్ తన ప్రవక్త(స)తో ఇలా అంటున్నాడు:

> ఇలా అను: "కేవలం అల్లాహ్‌యే సత్యం వైపునకు మార్గం చూపుతాడు. అలాంటప్పుడు మీరే చెప్పండి. సత్యం వైపునకు మార్గం చూపేవాడు. విధేయతకు ఎక్కువ అర్హుడా? లేక తనకు ఎవడైనా మార్గం చూపితే తప్ప స్వయంగా మార్గాన్ని పొందలేనివాడా? అసలు మీకేమయింది, ఇటువంటి తలకిందులు నిర్ణయాలు చేస్తున్నారు?" (యూనుస్ : 35)

ఈ విశ్లేషణ తరువాత ఇప్పుడు మనం ఈ అరబ్బు బహుదైవారాధకులు, దేవుని ప్రభుత్వ్యవస్థ పట్ల ఏ విధమైన మార్గభ్రష్టతకు గురై ఉన్నారు? వారి ఏ మార్గభ్రష్టతను సంస్కరించడానికి దేవుడు అంతిమ ప్రవక్త ముహమ్మద్(స)ను పంపాడు? ఇంకా అల్లాహ్ ఎందుకు ఖుర్‌ఆన్‌ను అవతరింపజేశాడు? అన్న ప్రశ్నలకు సమాధానం కోసం ఖుర్‌ఆన్ వైపు దృష్టిసారించినప్పుడు వారి నమ్మకం, ఆచరణలలో కూడా పూర్వపు జాతులు ఏ రెండు మార్గభ్రష్టతలకు గురయివుండేవారో అవే రెండు మౌలిక మార్గభ్రష్టతలు ఉన్నాయన్న సంగతి మనకు అవగతమవుతుంది. అంటే–

ఒకవైపు అల్లాహ్ సర్వసత్తాక ప్రభుత్వాధికారంలో, దైవత్వంలో

ఇతరులను భాగస్వాములుగా చేసేవారు. ఇంకా ఈ సృష్టి నిర్వహణపై ఎవరి అధికారమైతే నడుస్తుందో ఆయన అధికారంలో, ఆధిపత్యంలో ఏదో ఒక రూపంలో దైవదూతలు, మహాపురుషులు, సూర్యచంద్ర నక్షత్రాదులు కూడా భాగస్వాములని భావించేవారు. అందుకే తమ వేడుకోలు, విన్నపాలు, ఆరాధనలను కేవలం అల్లాహ్‌కే అంకితం చేయకుండా కాల్పనిక దైవాలను కూడా ఆశ్రయించేవారు.

రెండవ వైపు దేవుని దైవత్వంలో రాజకీయ, సామాజిక వ్యవహారాలలో కూడా అల్లాహ్‌యే ప్రభువు అన్న ధ్యాస వారికసలు లేనే లేదు. ఈ విషయంలో వారు, వారి మతగురువులను, వారి సర్దార్‌లను, వారి తాతముత్తాతలను మార్గదర్శకులుగా భావించి వారు చూపిన జీవన మార్గదర్శక నియమాలనే అనుసరించేవారు.

మొదటి మార్గభ్రష్టత విషయంలో ఖుర్ఆన్ ఇచ్చే సాక్ష్యం :

"ప్రజలలో ఒకడు (విశ్వాసం) అంచులపై నిలబడి అల్లాహ్‌కు దాస్యం చేసేవాడు ఉన్నాడు; ఒకవేళ లాభం కలిగితే తృప్తి పొందుతాడు. కాని ఏదైనా ఆపద సంభవిస్తే విముఖుడవుతాడు. అతనికి ఇహమూ దక్కదు, పరమూ దక్కదు. స్పష్టమైన నష్టం అంటే ఇదే. అతను అల్లాహ్‌ను కాదని, తనకు నష్టంగాని, లాభం గాని కలిగించలేని వారిని వేడుకుంటున్నాడు. ఇది మార్గభ్రష్టత్వానికి పరాకాష్ఠ. ఎవరి నష్టమైతే వారు చేసే లాభానికి అత్యంత సమీపంలో ఉందో, వారిని అతడు వేడుకుంటున్నాడు. ఎంత నికృష్టుడు అతని సంరక్షకుడు, ఎంత నికృష్టుడు అని సహచరుడు. *(అల్ హజ్ : 11-13)*

ఈ ప్రజలు అల్లాహ్‌ను కాదని తమకు నష్టాన్నిగాని, లాభాన్నిగానీ కలిగించలేని వారిని పూజిస్తున్నారు. పైగా ఇలా అంటున్నారు: "వారు అల్లాహ్ వద్ద మా కొరకు సిఫారసు చేస్తారు".

ప్రవక్తా! వారితో ఇలా అను; "ఆకాశాలలోగానీ, భూమిలోగానీ[1] అల్లాహ్ ఎరుగని విషయాన్ని గురించి ఆయనకు మీరు తెలుపుతున్నారా?" ఆయన పరిశుద్ధుడు. ఈ ప్రజలు చేసే షిర్కుకు అతీతుడూ, ఉన్నతుడూను. *(యూనుస్ : 18)*

ప్రవక్తా! వారితో ఇలా అను; "భూమిని రెండు రోజులలో సృష్టించిన దేవుణ్ణి మీరు తిరస్కరిస్తారా? ఇతరులను ఆయనకు సమానులుగా నిలబెడతారా?" *(హామీమ్ అస్ సజ్‌దహ్ : 41: 9)*

వారితో ఇలా అను; "ఇదేమిటి మీరు అల్లాహ్‌ను వదిలి, మీకు నష్టంగాని, లాభంగాని కలిగించే అధికారంలేని దానిని పూజిస్తున్నారు? అందరిదీ వినేవాడూ, అంతా తెలిసినవాడూ అల్లాహ్ మాత్రమే". *(అల్ మాయిదా 5: 76)*

"మనిషిపైకి ఎప్పుడైనా ఏదైనా ఆపద వచ్చిపడితే, అతడు తన ప్రభువు వైపునకు మరలి ఆయనకు మొరపెట్టుకుంటాడు తరువాత అతడి ప్రభువు అతడికి తన అనుగ్రహాన్ని ప్రసాదించినప్పుడు, అతడు గతంలో ఏ ఆపదను గురించి మొరపెట్టుకున్నాడో, ఆ ఆపదను మరచిపోయి ఇతరులను అల్లాహ్‌కు సమానులుగా నిలబెడతాడు.[2] ఈ విధంగా అతడు (ప్రజలను కూడా) అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తాడు." *(అజ్ జుమర్ 39: 8)*

---

1. మీరు ఆరాధించే ఆరాధ్యులు, నా వద్ద (అల్లాహ్ వద్ద) సిఫారసు చేయగల శక్తిగలవారని, వారు సిఫారసు చేయగానే అల్లాహ్ అంగీకరిస్తాడన్న భ్రమకు లోనైఉన్నారా? అందుకే మీరు వారి ముందు తలలు వంచి వేడుకుంటూ, మొక్కు బడులు చెల్లిస్తున్నారా? అయితే తెలుసుకోండి, నా ముందు నిలబడి సిఫారసు చేయగల శక్తిసామర్థ్యాలుగలవారెవ్వరినీ నేనెరుగను. ఇంకా వారు సిఫారసు చేయగానే అంగీకరించేటంతటి ఇష్టమైనవారు కూడా నా దృష్టిలో

"మీకు లభించిన అనుగ్రహం ఏదైనా అది అల్లాహ్ తరఫు నుండే లభించినది. మీకేదైనా గడ్డుకాలం దాపురించినప్పుడు మీరు మీ మొరలతో ఆయన వైపునకే పరుగెడుతారు. కాని అల్లాహ్ ఆ గడ్డుకాలాన్ని తొలగించినప్పుడు (ఈ కనికరానికి కృతజ్ఞతగా) మీలో ఒక వర్గం ఒక్కసారిగా తన ప్రభువునకు ఇతరులను భాగస్వాములుగా చెయ్యటం ప్రారంభిస్తుంది, అల్లాహ్ చేసిన ఉపకారానికి కృతఘ్నతగా. సరే మంచిది, సుఖాలను అనుభవించండి. త్వరలోనే మీకు తెలిసి పోతుంది. ఎవరిని గురించి మీరు ఏ మాత్రమూ ఎరుగరో వారికి, మేము ఇచ్చిన ఉపాధిలో భాగాలను నిర్ణయిస్తారు.[3] దేవుని తోడు, ఈ అబద్ధాన్ని మీరు ఎలా కల్పించారు? అని మిమ్మల్ని తప్పనిసరిగా అడగటం జరుగుతుంది." *(అన్ నహ్ల 53-56)*

"ఇదేవిధంగా చాలామంది ముష్రిక్కులకు తమ సంతానయోగ్యతను, వారు నిలబెట్టిన భాగస్వాములు సరైనదిగా కనిపించేలా చేశారు,

---

ఎవ్వరూ లేరు. లేదా ఏమిటి, నాకు సయితం తెలియని మీ సిఫారసు దారుల గురించి నాకు ఎరుకపరుస్తున్నారా? వాస్తవమేమంటే, ఒక వస్తువును గురించి అల్లాహ్‌కు తెలియదు అని అంటే అలాంటి వస్తువేదీ ఈ విశ్వంలో లేనేలేదు అని తెలుసుకోండి.

2. అల్లాహ్‌కు సమానులుగా నిలబెట్టడం అంటే, తనపై నుండి తొలగిపోయిన ఆపద ఫలానా పెద్దమనిషి ద్వారా తొలగిపోయిందని, ఇంకా తనకు లభించిన బహుమానం (అదృష్టం) ఫలానా వలీ ద్వారానో, పండితుని ద్వారానో లభించిందని చెప్పడమన్నమాట.

3. .... తమ ఆపదలను తొలగించినవారు, తమ కష్టాలను దూరం చేసినవారు ఆ భాగస్వాములేనన్నదానికి వారి వద్ద ఏ ఆధారమూ లేదు. తమాషా ఏమిటంటే, వీరు తమ మొక్కుబడులన్నీ అల్లాహ్ ప్రసాదించిన వాటినుండే చెల్లిస్తారు.)

వారిని వినాశనానికి గురిచెయ్యటానికి, వారిని వారి ధర్మం సంశయా స్పదమైనదిగా చెయ్యటానికి." *(అన్‌ఆమ్ : 137)*

వాస్తవానికి ఇక్కడ భాగస్వాములు అంటే విగ్రహాలు, దేవతలు కానేకారు. వారు సంతాన బలిని, అరబ్బులకు పుణ్యప్రదమైన పనిగా భావించేలా చేసిన పండితులు, మత గురువులు, పైగా వీరు ఈ ఘోరకలిని హజ్రత్ ఇబ్రాహీం(అలై), ఇస్మాయీల్(అలై)గార్ల ధర్మంగా భావింపజేశారు. సృష్టి వ్యవహారాలలో వారి అధికారం లేదా ఆధిపత్యం సాగుతుందని భావించి వారిని అల్లాహ్‌కు సాటి (షిర్క్) కల్పించలేదు. వీరినే తమ సామాజిక, ఆర్థిక, రాజకీయ, నైతిక వ్యవహారాలలో తమ అధికార శక్తిసామర్థ్యాలలో తమ ఇష్టమైన రీతిలో మార్పులు చేయ గలవారని భావించి మాత్రమే దైవత్వంలో భాగస్వాములుగా భావించే వారు.

"అల్లాహ్ అనుమతించకుండానే ధర్మంవంటి స్వభావం గల ఒక విధానాన్ని తమ కొరకు రూపొందించిన దైవ భాగస్వాములనెవరినైనా వారు కలిగి ఉన్నారా?" *(అష్షూరా : 21)*

దీన్ (ధర్మం) అదే పదం పూర్తి వివరణ ముందు రాబోయే పంక్తులలో వివరించడం జరుగుతుంది. ఈ ఆయుత భావార్థం కూడా అక్కడే విడమర్చి చెప్పబడుతుంది. అయితే ఇక్కడ ఒక విషయం అర్థమవుతుంది– అదేమంటే, దైవాజ్ఞ లేకుండా వారి మతగురువులు మరియు సర్దార్‌లు తమ ఇష్టమొచ్చినట్లు నియమ నిబంధనలను తయారు చేసి ఇదే ధర్మమని అరబ్బువాసులను నమ్మబలికి తప్పనిసరిగా అనుసరించేలా చేయడమే నిజానికి దేవుని దైవత్వంలో, పాలనా వ్యవస్థలో భాగస్వాములుగా (షిర్క్) చేయడమని తెలుస్తుంది.

## ఖుర్ఆన్ సందేశం

చరిత్రకందిన పూర్వపు జాతులు మొదలు ఖుర్ఆన్ అవతరణ వరకు ఖుర్ఆన్ ప్రస్తావించిన జాతుల అపమార్గాన్ని, అంధ విశ్వాసాలను, ధర్మ భ్రష్టతను పరిశీలించడం ద్వారా మనకు స్పష్టంగా అర్థమైన విషయమేమిటంటే, ఈ జాతుల వారికి అల్లాహ్ ఔన్నత్యాన్ని గురించి తెలియక కాదు. తెలుసు, అల్లాహ్‌యే దేవుడు, ప్రభువు అన్న విషయాన్ని కూడా తిరస్కరించేవారు కాదు. కాకపోతే వీరి అసలు మార్గభ్రష్టత ఏమిటంటే, ఇంతకుముందు ధాతువు అర్థాలతో, ఖుర్ఆన్ సాక్ష్యాధారాలతో సహా వివరించిన దేవుని దైవత్వపు ఐదు భావనలను వీరు రెండు భాగాలుగా విభజించుకున్నారు.

ప్రభువు (రబ్) అంటే, సర్వసత్తాక అధికార భావనలో జీవరాశులను పోషించేవాడు, వాటిని కనిపెట్టుకొని ఉండేవాడు, వాటి అవసరాలను తీర్చేవాడు, రక్షణ కల్పించేవాడు కార్యసాధకుడు. కాని వీరి దృష్టిలో ఈ భావన మరో విధంగా ఉంది. వీరు అల్లాహ్‌నే పరమ ప్రభువుగా అంగీకరిస్తూనే, ఆయనతోపాటు దైవదూతలను, దైవేతరులను, జిన్నులను, ఇతర శక్తులను, నక్షత్రాలను, గ్రహాలను, ప్రవక్తలను, మత గురువులను, పండితులను కూడా దైవత్వంలో భాగస్వామ్యం ఉంది అని నమ్మేవారు.

ఇంకా– రబ్ (ప్రభువు) అంటే సర్వాధికారాలకు స్వామి, సర్వసత్తాక ప్రభువు, మార్గనిర్దేశకుడు, శాసన ప్రదాత, విశ్వవ్యవస్థ మనుగడకు మూలాధారం అన్న భావనను వీడి, వీరు దీనికి పూర్తి భిన్నమైన భావన కలిగి అల్లాహ్‌ను కాక తమపై ఆధిపత్యం వహించే మానవులనే ప్రభువుగా భావించేవారు. లేదా పైకి మాత్రం అల్లాహ్‌నే తమ ప్రభువు అంటూనే ఆచరణరీత్యా తమ నైతిక నడవడికలో, సామాజిక, నాగరిక విషయాలలో, ఆర్థిక రాజకీయ రంగాలలో తమలాంటి మానవులు చూపిన మార్గాన్నే నడుస్తూ (అనగా ప్రభువు మార్గంగా భావిస్తూ) వారికే విధేయత చూపేవారు.

ఈ మార్గభ్రష్టతను రూపుమాపడానికే ఆది నుండి ప్రవక్తలు ప్రభవింప జేయబడ్డారు. అంతిమ ప్రవక్త ముహమ్మద్(స) ప్రభవింపజేయబడింది కూడా ఇందుకోసమే. పై సకల భావనల ప్రకారం, ప్రభువు ఒక్కడే, ఆయనే అల్లాహ్. ప్రభువు యొక్క సువిశాల నిర్వహణా వ్యవస్థ విభజింప వీలులేనటువంటిది. అందులో ఏకాస్త అయినా లేదా మరే రూపంలోకాని ఎవ్వరూ భాగస్వాములు కారు. ఇదీ విశ్వజనీన వ్యవస్థ. దీనికి సృష్టికర్త ఒక్కడే. దీని పర్యవేక్షకుడు, నిర్వాహకుడు, అధికారి కూడా ఒక్కడే.

కనుక ఈ సృష్టిపై సకల అధికారాలకు, ఆధిపత్యానికి యజమాని కూడా ఒకే ఒక ప్రభువుకు ఉంది. దీని నిర్మాణంలో కాని, దీని నిర్వహణ లోకాని ఎవ్వరూ భాగస్వాములుగాని, సహాయకులు గాని లేనేలేరు. ఈ విశ్వ వ్యవస్థకు మూలం ఆయనే కనుక ఆయనే సర్వాధికారాలకు స్వామి, ప్రభువు అంతేకాదు, నైతిక, సామాజిక, రాజకీయ, జీవితపు సకల రంగాలలో మార్గ నిర్దేశక ప్రభువు ఆయనే. ఆయనే మీ ఆరాధ్య దైవం. ఆయనే మీ సాష్టాంగ ప్రణామాలకు తగినవాడు. ఆయనే మీ విన్నపాలు, వేడుకోలు వినేవాడు. ఆయన ఒక్కడిపైనే మీరు నమ్మకముంచాలి. ఆయనపైనే మీరు భారం మోపాలి. ఆయననే మీ సకల అవసరాలను తీర్చే యజమానిగా భావించాలి. ఈ విధంగా ఆయనే చక్రవర్తి, ఆయనే సృష్టికంతటికీ ప్రభువు, ఆయనే శాసనకర్త, శాసన ప్రదాత.

మీరు అజ్ఞానం కారణంగా దైవత్వాన్ని, సర్వసత్తాక ప్రభూధికారాన్ని ఒకదానినుంచి ఒకటి వేరు చేశారు. వాస్తవానికి ప్రభువు కావడానికి దైవత్వం తప్పనిసరి. వీటిని ఒకదానితో మరొకటి విడదీయలేము. ఇంకా ఏ రూపం లోనైనా సృజింపబడినవాటిని దైవానికి సాటి కల్పించడం సరైనది కాదు.

ఈ సందేశాన్నే ఖుర్‌ఆన్ ఏ విధంగా తెలియజేస్తుందో దాని భాషలోనే విందాం–

"వాస్తవంగా మీ ప్రభువు అల్లాహ్‌యే. ఆయన ఆకాశాలనూ, భూమినీ ఆరు దినాలలో సృష్టించాడు. తరువాత తన రాజ్యపీఠాన్ని అలంకరించాడు. రాత్రిని పగటిపై కప్పివేస్తాడు. ఆ తరువాత పగలు రాత్రి వెంట పరుగుతీస్తూ ఉంటుంది. ఇంకా ఆయన సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, నక్షత్రాలను పుట్టించాడు. అన్నీ ఆయన ఆజ్ఞకు కట్టుబడి ఉన్నాయి. తెలుసుకోండి, సృష్టి ఆయనదే. దానిపై ఆధిపత్యమూ ఆయనదే. అల్లాహ్ అనంతమైన శుభాలు కలవాడు. సకల లోకాలకు ప్రభువు, స్వామి."

*(ఆరాఫ్ : 54)*

వారిని అడుగు : "ఆకాశం నుండి, భూమి నుండీ మీకు ఉపాధినిచ్చేవాడు ఎవడు? వినే శక్తీ, చూసే శక్తీ ఎవడి అధీనంలో ఉన్నాయి? ప్రాణం లేని దాని నుండి ప్రాణమున్నదానినీ, ప్రాణమున్నదాని నుండి ప్రాణంలేని దానినీ వెలికితీసేవాడు ఎవడు? ఈ విశ్వవ్యవస్థను నడుపుతున్నవాడు ఎవడు? వారు **'అల్లాహ్'** అని తప్పకుండా అంటారు. ఇలా అను; అలాంటప్పుడు మీరు (సత్యానికి వ్యతిరేకంగా నడవటం) మానుకోరేమిటి? ఆ అల్లాహ్‌యే మీ నిజమైన ప్రభువు. కనుక సత్యాన్ని తృణీకరిస్తే మార్గభ్రష్టత్వం తప్ప ఇక మిగిలేదేమిటి? అసలు మీరు ఎటు మరలింపబడుతున్నారు?" *(యూనుస్ : 31,32)*

"ఆయన ఆకాశాలనూ, భూమినీ సత్యంలో సృష్టించాడు. ఆయనే పగటిని రేయితోనూ, రేయిని పగటితోనూ చుట్టివేస్తాడు. ఆయనే సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ నియమబద్ధులుగా చేసి ఉంచాడు. వాటిలో ప్రతి ఒక్కటీ ఒక నిర్ణీత కాలం వరకు సంచరిస్తూ ఉంటుంది. తెలుసుకోండి. ఆయన మహాశక్తిమంతుడు, మన్నించేవాడూను". *(జుమర్ 5,6)*

"మీ కొరకు భూమిని నివాస స్థలంగా చేసినవాడూ, పైన ఆకాశాన్ని కప్పుగా నిర్మించినవాడూ, మీ రూపాన్ని తీర్చిదిద్దినవాడూ, దానిని

ఎంతో చక్కగా మలిచినవాడూ, మీకు పరిశుద్ధమైన పదార్థాలను ఆహారంగా ఇచ్చినవాడూ అల్లాహ్‌యే కదా! ఆ అల్లాహ్‌యే (ఈ పనులన్నీ చేసినవాడు) మీ ప్రభువు". *(మూ'మీన్ : 64)*

"ఆయన సజీవుడు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు ఎవ్వడూ లేడు. ఆయననే మీరు వేడుకోండి, మీ ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకం చేసుకోండి." *(40 : 65)*

"అల్లాహ్ మిమ్మల్ని మట్టితో సృష్టించాడు... ఆయన పగలు లోనికి రాత్రినీ, రాత్రిలోనికి పగలునూ జొనుపుతున్నాడు. సూర్యచంద్రులను ఆయన నియమబద్ధులను చేసి ఉంచాడు. ఇదంతా ఒక నిర్ణీత వ్యవధి వరకు సాగిపోతోంది. ఈ పనులన్నీ చేసే ఆ అల్లాహ్‌యే మీ ప్రభువు. సామ్రాజ్యాధికారం ఆయనదే. ఆయనను కాదని మీరు పిలిచే ఇతరులు కనీసం ఒక గడ్డిపోచకు కూడా యజమాని కారు. వారిని వేడుకుంటే, వారు మీ ప్రార్థనలను వినలేరు. మీరు కల్పించిన దైవత్వపు భాగస్వామ్యాన్ని వారు ప్రళయం నాడు తిరస్కరిస్తారు."
*(ఫాతిర్ 11-14)*

"ఆకాశాలలో, భూమిపై ఉన్నవారెవరైనా ఆయన దాసులే. అందరూ ఆయన ఆజ్ఞకే కట్టుబడి ఉన్నారు... ఆయన మీకు స్వయంగా మీకే చెందిన ఒక ఉపమానాన్ని ఇస్తున్నాడు. మీ అధీనంలో ఉన్న బానిస లలో కొందరు మేము మీకు ఇచ్చిన సిరిసంపదలలో మీతోపాటు సమానమైన భాగస్వాములుగా ఉన్నవారూ, మీరు పరస్పరం మీ సమానులకు భయపడేవిధంగా, మీరు భయపడేటటువంటివారు వారిలో ఎవరైనా ఉన్నారా? ఈ విధంగా బుద్ధికుశలత కలవారికి మేము సూచనలను స్పష్టంగా వివరిస్తాము. కాని ఈ దుర్మార్గులు జ్ఞానం లేకుండానే తమ భ్రమల వెంటపడ్డారు. అల్లాహ్ అపమార్గం

పట్టించిన వ్యక్తికి మార్గం చూపగలవాడెవడు? అటువంటి వారికి సాయపడేవాడెవడూ ఉండడు. కనుక ఏకాగ్రచిత్తంతో మీ ముఖాన్ని ఈ ధర్మం దిశలో స్థిరంగా నిలపండి. అల్లాహ్ మానవులను ఏ స్వభావం ఆధారంగా సృష్టించాడో దీనిపై స్థిరంగా ఉండండి. అల్లాహ్ సృజించిన స్వరూప స్వభావాలు మార్చటానికి శక్యం కానివి, ఇదే సవ్యమైన తిన్నని ధర్మమార్గం, కాని చాలామందికి తెలియదు".

*(అర్‌రూమ్ : 26-30)*

"వారు అల్లాహ్‌ను ఏ విధంగా గౌరవించాలో, ఆ విధంగా గౌరవించనే లేదు; (ఆయన శక్తిసామర్థ్యాలు ఎలాంటివంటే) ప్రళయం నాడు, యావత్తు భూమండలం ఆయన పిడికిలిలో ఉంటుంది. ఆకాశాలు ఆయన కుడిచేతిలో చుట్టబడి ఉంటాయి. వారు చేస్తున్న షిర్క్ (బహు దైవారాధన)కు ఆయన అతీతుడు, పరిశుద్ధుడు".

*(అజ్‌జుమర్ 39: 67)*

"కనుక అల్లాహ్ మాత్రమే స్తుతిపాత్రుడు. ఆయన భూమికీ, ఆకాశాలకూ ప్రభువు. భూమ్యాకాశాలలో ఘనత ఆయనకు మాత్రమే చెందుతుంది. శక్తిమంతుడూ, వివేకవంతుడూ ఆయన మాత్రమే".

*(జాసియాహ్ 36,37)*

"ఆకాశాలకూ, భూమికీ, భూమ్యాకాశాల మధ్య ఉన్న సర్వానికీ ఆయన ప్రభువు. కాబట్టి మీరు ఆయనకు దాస్యం చేయండి. ఆయన దాస్యంలోనే స్థిరంగా ఉండండి. మీకు తెలిసినంత వరకు, ఆయనతో సమానమైన స్థాయిగలవాడెవడైనా ఉన్నాడా?" *(మర్యమ్ :65)*

"ఆకాశాలలో, భూమిలో దాగివున్నదంతా అల్లాహ్ ఆధీనంలో ఉన్నది. అన్ని విషయాలు ఆయన వైపునకే మరలింపబడతాయి. కనుక ప్రవక్తా! నీవు ఆయననే సేవించు. ఆయననే నమ్ముకో". *(హూద్ : 123)*

'ఆయన తూర్పు పడమరలకు స్వామి. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు ఆయననే వకీలు (నమ్మకస్తునిగా, కార్యసాధకుని)గా చేసుకో'. *(ముజ్జమ్మిల్ : 9)*

"మీ ఈ సంఘం వాస్తవానికి ఒకే ఒక సంఘం, నేను మీ ప్రభువును కనుక మీరు నన్ను ఆరాధించండి. కాని (ఇది ప్రజలు చేసుకున్న నిర్వాకమే) వారు తమలో తాము ధర్మాన్ని ముక్కలు ముక్కలుగా చేసుకున్నారు. అందరూ మా వైపునకు మరలవలసిందే".

*(అంబియా : 92,93)*

"ప్రజలారా! మీ ప్రభువు తరఫు నుండి మీపై అవతరింపజెయ్యబడిన దానిని అనుసరించండి. మీ ప్రభువును త్రోసిరాజని ఇతర సంరక్షకులను అనుసరించకండి. *(ఆరాఫ్ : 3)*

ఇలా చెప్పు, "గ్రంథ ప్రజలారా! మాకూ, మీకూ మధ్య సమానమైన ఒక విషయం వైపునకు రండి. మనం అల్లాహ్‌కు తప్ప మరెవరికీ దాస్యం చెయ్యరాదు. ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ నిలబెట్టరాదు. మనలోని వారెవరూ అల్లాహ్‌ను తప్ప మరెవరినీ తమ ప్రభువుగా చేసుకోరాదు". *(అలిఇమ్రాన్ : 64)*

ఇలా అను; "నేను మానవుల ప్రభువు, మానవుల చక్రవర్తి, మానవుల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్) శరణు కోరుతున్నాను".

*(అన్‌నాస్ :1–3)*

"కనుక తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి. ఆరాధనలో తన ప్రభువుతోపాటు మరెవ్వరినీ చేర్చకూడదు."

*(అల్ కహఫ్ : 110)*

పై ఖుర్‌ఆన్ వాక్యాలను వరుస క్రమంలో అధ్యయనం చేయడం వల్ల స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, ఖుర్‌ఆన్ 'రుబూబియత్'ను పరిపాలన, సార్వభౌమాధికారం (Sovereignty)గా ఖరారు చేసింది. ఇంకా ప్రభువు (రబ్) అన్న పదాన్ని తిరుగులేని రాజ్యాధిపతిగా, ఎవరూ భాగస్వాములుగా లేని స్వామిగా, అధికారిగానే పేర్కొన్నది.

- అలాగే ఆయన మనకు, సర్వసృష్టికి ప్రభువు, సంరక్షకుడు, అవసరాలను తీర్చేవాడు.
- అలాగే ఆయన మన యజమాని, కనిపెట్టుకొని వుండేవాడు, కార్యసాధకుడు, కార్యనిర్దేశకుడు.
- అలాగే ఆయన విధేయత పాటించడం, గౌరవించడంపైనే మన సామూహిక జీవన సౌధం సరిగా నిలబడగలుగుతుంది. ఆయన సంపూర్ణ వ్యక్తిత్వంతో గల సంబంధంతోనే ఛిన్నాభిన్నంగా ఉన్న వ్యక్తుల, వివిధ వర్గాల మధ్య మానవ సంబంధం సాధ్యమవుతుంది. అలాగే ఆయన మనందరి ఉపాసనలకు, సకల జీవరాశుల ఆరాధ్యానికి, విధేయతకు, పూజకు అర్హుడు.

అలాగే ఆయన మనందరికీ, ప్రతి వస్తువుకు యజమాని, స్వామి, శాసనాధికారి. అరబ్బులు, ప్రపంచంలోని అజ్ఞాన జాతులన్నీ, 'రుబూబియత్' (ప్రభు సర్వాధిపత్యం) అన్న సంపూర్ణ భావన యొక్క దైవత్వాన్ని ఐదు వివిధ భాగాలుగా విభజించారు. తమ ఊహాగానాలతో ప్రభువుకు చెందిన వివిధ కార్యనిర్వాహక శాఖలు వివిధ శక్తుల ఆధీనంలో ఉన్నాయని భావించారు. ఇప్పటికీ భావిస్తున్నారు. కాని ఖుర్‌ఆన్ తన శక్తిమంతమైన వాదనలతో ఈ సర్వసృష్టి వ్యవహారాలు ఎవరి

ఆధీనంలోనైతే ఉన్నాయో ఆయన 'ప్రభుత్వపు' ఏ పనిలోనూ ఇతరులెవ్వరికీ ఏ రూపంలోనూ ఎటువంటి సంబంధం లేదని నిరూపించింది. ఎవరైతే ఈ సృష్టిని ఉనికిలోకి తెచ్చాడో ఆయనే ప్రభుత్వపు ఎన్ని భావనలైతే ఉన్నాయో వాటన్నింటికీ అవన్నీ ఒక్కడైన ఆ దైవానికే స్వంతం అన్న విషయానికి స్వయంగా ఈ విశ్వవ్యవస్థే ప్రబల సాక్ష్యం.

కనుక ఎవడైనా ఆయన సృజించిన సృష్టిలో ఉంటూ ప్రభువు పాలనా వ్యవస్థలోని ఏ ఒక్క భాగాన్ని ఏ భావంలోనైనా ఆ ఏకైక ప్రభువుకు తప్ప మరెవరికైనా ఆపాదిస్తే అతను యదార్థంపై యుద్ధం చేస్తున్నాడు. సత్యంపట్ల విముఖత చూపుతున్నాడు. సత్యంపై తిరుగుబాటు చేస్తున్నాడు. వాస్తవ విషయానికి వ్యతిరేకంగా పనిచేసి తన్నుతాను నష్టానికి, వినాశానికి లోనుచేసుకుంటున్నాడు.



# ఇబాదత్ (ఆరాధన)

## నిఘంటువు అర్థ పరిశోధన

అరబీ భాషలో ఉబూదత్, ఉబూదియ్యత్ మరియు అబదియ్యత్ అనగా అణుకువ, అశక్తత అని అర్థం. అంటే లొంగిపోవటం, ఆత్మసమర్పణ చేసుకోవటం, ఒకరి సమక్షంలో ఆయుధాలను పడవేసి తన తరఫున ఎలాంటి ప్రతిఘటన, విముఖత ఉండదని నిరూపించటం, ఇక మీదట నీవు నాచేత నీవు ఇష్టపడిన విధంగా సేవ చేయించుకో అని చెప్పటం అన్నమాట! ఇదే భావంలో ప్రయాణానికి సర్వసిద్ధమైన ఒంటెను అరబ్బులు 'బఅయిరముఅబ్బద్' అని అనేవారు. బాగా వాడబడి అందరికీ సుగమం- అయిన దారిని "తరీఖ్ ముఅబ్బద్" అని అంటారు. ఇబాదత్ (ఆరాధన) అనే పదాన్ని బానిసత్వము, విధేయత, పూజ, సేవ చేయడం, బంది లేదా ఆటంకం అనే అర్థాలలో వాడతారు. అరబీ భాషలో ప్రసిద్ధమైన నిఘంటువు 'లిసానుల్ అరబ్'లో వివరించిన ఆరాధన అనే పదము భావాలు ఈ క్రింద వరుస క్రమంలో పొందుపరచబడ్డాయి.

1. అల్అబ్దు: "అల్ మమ్లూమ్ ఖిలాఫత్ హుర్రి' (అంటే ఒకరి సొత్తు. అంటే అబ్ద్ అనే పదం 'స్వేచ్ఛ'కు వ్యతిరేక పదం- అంటే దాస్యంతో కూడు కున్నది. "త అబ్బదర్ రజుల" (మనిషిని బానిసగా, దాసునిగా చేసుకున్నాడు) ఇదే భావం. అబ్బదహు, ఆబదహు, లేదా ఇతబదహుకు వర్తిస్తుంది. హదీసులో ఇలావుంది: సలాసతున్ అన ఖాసిముహుమ్ రజులున్ ఇ'తబద ముహర్రరన్- వ ఫీ రివాయతిన్ ఆబద ముహర్రదన్ (అర్థం : ప్రళయదినాన నేను ముగ్గురు

వ్యక్తులకు వ్యతిరేకంగా వాదిస్తాను – వారిలో ఒకడు; ఒక స్వతంత్రుణ్ణి బానిసగా చేసుకున్నవాడు. రెండవ వాడు : బానిసకు స్వేచ్ఛను ఒసగిన తరువాత కూడా అతని పట్ల బానిసలా వ్యవహరించినవాడు. మూడవ వాడు :)

> "ఇక నీవు నాకు ఉపకారం చేసి ఎత్తి పొడుస్తూ ఉన్న విషయం, దాని యదార్థం ఏమిటంటే, నీవు ఇస్రాయీలు సంతతి వారిని బానిసలుగా చేసుకున్నావు". *(అష్ షుఅరా : 22)*

2. అల్ ఇబాదతు – అత్తాఅతు మఅల్‌ఖుజూయి : పూర్తి వినయ వినమ్రతలతో నిర్వహించే పనిని ఇబాదత్ (దాస్యం, ఆరాధన) అని అంటారు. 'నీవు తాగూత్‌కు దాసోహం అన్నావు' అంటే, తాగూత్‌కు విధేయత చూపుతున్నావని అర్థం. 'మేము నిన్నే ఆరాధిస్తున్నాము' అనగా మేము నీవు చూపిన మార్గాన్నే పూర్తి విధేయతతో అనుసరిస్తున్నాము అని భావం. మీ ప్రభువునే ఆరాధించండి అంటే మీ ప్రభువుకే విధేయులై ఉండండి అని అర్థం. ఫిరౌన్ ఇలా అన్నాడు: "మూసా, హారూన్‌ల జాతి వారు (అనగా బనీ ఇస్రాయీల్ వారు) నా సేవకులు'. దీని అర్థమేమిటంటే, వారు మా ఆజ్ఞాబద్ధులై ఉన్నారు. తనకు తానుగా ఒక రాజుకు స్వయం సమర్పించుకున్న వానిని 'ఆబిద్' (సేవకుడు, దాసుడు) అని అంటారు. ఇబ్నుల్ అంబారీ ఇలా అంటున్నాడు: 'ఫులానున్ ఆబిదున్' అనగా అతడు తన యజమానికి విధేయుడై ఉన్నాడు మరియు ఆయన ఆజ్ఞలకు బద్ధుడయ్యాడు.

3. అబదహు ఇబాదతున్ వ మా'బదన్ వ మా'బదతున్ త అల్లహ ఇలాహహు. ఆయనను ఆరాధించాడు అనగా ఆయనను పూజించాడు. 'అత్తఅబ్బుదు అన్నుస్క్' ఇందులో 'తబఅద' అనగా సేవకుడిగా, పూజారిగా మారడం. ఒక కవి ఇలా అంటున్నాడు:

4. అబ్బదహు వ అబదబిహి లజిమహు ఫలమ్ యుఫారిఖుహు అనగా అర్థమేమిటంటే, అతను విడిపోలేదు లేదా అతని పంచన చేరాడు. అతన్ని విడవలేదు.

5. మా అబదక ఘనియ్యున్ అయి మా హబసన్. ఎవరైనా తన దగ్గరికి రాకుండా ఆగిపోతే అతనిని ఇలా అడుగు తాడు. ఏ విషయం నిన్ను నా దగ్గరకు రాకుండా నిలిపివుంచుతుంది?

ఈ వివరణాత్మక విశ్లేషణతో మనకు తెలిసే విషయమేమంటే, ఒకరి ఆధిపత్యాన్ని, ప్రాబల్యాన్ని అంగీకరించి తన స్వేచ్ఛను త్యాగం చేసి, తలబిరుసు తనాన్ని, ప్రతిఘటనను మానుకొని తనకు తాను స్వయం సమర్పణ చేసు కోవడమే ఆరాధన అనే పదానికి మూల అర్థం. ఇదే ఆరాధన, దాస్యం వాస్తవికత. కనుక అరబ్బు వాసులకు ఆరాధన అనే పదాన్ని వినగానే ముందుగా వారి మదిలో స్మరించే భావం ఆరాధన, దాస్యమే. ఎందుకంటే, ఒక బానిస లేదా దాసుని అసలు పని తన యజమాని లేక స్వామికి విధే యుడయి తనకు తాను స్వయం సమర్పించుకోవడమే. కనుక దాస్యం తరువాత వెంటనే స్మరించే భావం విధేయత. ఒక బానిస తన స్వామికి దాస్యం మరియు విధేయతలో తనకు తాను సమర్పించుకోవడమే కాక మనస్ఫూర్తిగా ఆయన గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని గుర్తించి గౌరవిస్తాడు కూడా. అనేక విధాలుగా అతని అనుగ్రహాలకు కృతజ్ఞత తెలుపుతాడు. అతనిపట్ల భక్తిపారవశ్యంలో అతిశయిల్లుతాడు. రకరకాలుగా అతని ఉపకారాలనో అభివ్యక్తం చేస్తాడు. పరిపరి విధాల సేవలుచేస్తాడు. దాని పేరే పూజ. దాసుడు తన స్వామి ముందు తలవంచటమేగాక తన మనసును కూడా అతనియందు లగ్నం చేసినపుడు దాస్యభావం తొణికిసలాడుతుంది. ఇక మిగిలిన రెండు భావాల విషయానికి వస్తే అవి ఆరాధ్యపు భావనలో పాక్షికమైనవి, సాపేక్షికమైనవేగాని ప్రాథమ్యం గలవికావు.

## ఖుర్‌ఆన్‌లో ఆరాధన అనే ప్రయోగం

నిఘంటువు అర్థ పరిశోధన తరువాత మనం ఖుర్‌ఆన్ వైపు దృష్టి సారించినట్లయితే తెలిసేదేమిటంటే, ఈ పవిత్ర గ్రంథంలో ఆరాధన అనే పదం

పైన చెప్పిన మూడు అర్థాలలో ప్రయోగించబడింది. కొన్నిచోట్ల మొదటి, రెండవ భావాలలో వాడితే మరికొన్ని చోట్ల కేవలం రెండవ అర్థంలో, ఇంకొన్ని చోట్ల కేవలం మూడవ అర్థంలో తీసుకోవటం జరిగింది. కొన్ని చోట్ల మొత్తం మూడు అర్థాలలోనూ వాడడం జరిగింది.

మొదటి మరియు రెండవ భావాలలో తీసుకున్న ఉదాహరణలు

తరువాత మేము మూసానూ, అతని సోదరుడు హారూన్‌నూ మా సూచనలతో, స్పష్టమైన అధికారిక ప్రమాణంతోనూ, ఫిరౌన్ వద్దకూ అతని అధికారుల వద్దకూ పంపాము. కాని వారు అహంభావం కనబరచారు. మరీ పొగరుబోతులై, "మేము మా వంటివారే అయిన ఇద్దరు మనుషులను విశ్వసించాలా? ఆ మనుషులైనా మా వద్ద బందీగా ఉన్న జాతికి చెందినవారు."అంటూ ఆ ఇద్దరినీ తిరస్క రించారు. *(మూ'మినూన్ : 45-47)*

ఫిరౌన్, మూసాను ఎత్తి పొడుస్తూ, "మేము నిన్ను బాల్యంలో మా ఇంట్లో పెంచలేదా?" అని అన్నప్పుడు, మూసా ఇలా అన్నాడు: "నీవు నాకు ఉపకారం చేసి ఎత్తిపొడుస్తూ ఉన్న విషయం, దాని యదార్థం ఏమిటంటే, నీవు ఇస్రాయీలు సంతతి వారిని బానిసలుగా చేసు కున్నావు." *(అష్ షుఅరా : 22)*

పై రెండు వాక్యాలలో ఆరాధన (ఇబాదత్) అంటే, దాస్యం, సేవ, విధేయత, ఆజ్ఞాబద్ధులై వుండటమని అర్థం. ఫిరౌన్ ఇలా అన్నాడు: "మూసా, హారూన్ మరియు వారి జాతి వారు మా బానిసలు (సేవకులు), మా ఆజ్ఞలకు బద్ధులై ఉన్నవారు. దానికి సమాధానంగా మూసా(అలైహి) ఏమన్నారంటే; "నీవు నాపై చూపిన అనుగ్రహం, దేని గురించి అయితే నీవు ఎత్తి పొడుస్తు న్నావో దాని యదార్థమేమిటంటే, నీవు బనీ ఇస్రాయీల్ సంతతిని నీ బానిసలుగా చేసుకున్నావు. వారిచేత వెట్టిచాకిరి చేయించుకుంటున్నావు"

"విశ్వసించిన ప్రజలారా! నిజంగానే మీరు మమ్మల్ని సేవించేవారే అయితే, మేము ప్రసాదించిన పరిశుభ్రమైన వస్తువులను నిస్సంకోచంగా తినండి. అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపండి".

*(అల్ బఖర : 172)*

## దాస్యం, విధేయత అనే అర్థంలో ఇబాదత్

ఇస్లాం కంటే ముందు ఈ ఖుర్‌ఆన్ అవతరణ కాల పరిస్థితులను పరిశీలించినట్లయితే, అరబ్బులు తమ మతపెద్దల ఆదేశాలను, తమ పూర్వీకుల మూఢనమ్మకాలను అనుసరిస్తూ అన్నపానీయాల విషయంలో లేనిపోని ఆంక్షలను విధించుకునేవారు. వారు ఇస్లాంను స్వీకరించాక అల్లాహ్ వారిని ఇలా ఆజ్ఞాపించాడు: ఒకవేళ మీరు నన్ను ఆరాధిస్తున్నట్లయితే మీరు ఇంతకు ముందు విధించుకున్న ఆంక్షలను వదలివేయండి. మేము దేన్నయితే ధర్మసమ్మతం (హలాల్) చేశామో దాన్ని ధర్మమైనదిగా, ఇంకా దేన్ని అధర్మమైనదిగా (హరామ్) చేశామో దాన్ని అధర్మమైనదిగా భావించండి. దీని ద్వారా స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, మీరు మీ పండితుల, మీ మత పెద్దల దాసులు కారు; మీరు మా (అల్లాహ్) దాసులు, వాస్తవంగా మీరు వారి విధేయత, ఆజ్ఞాపాలన వదలి మా విధేయత, ఆజ్ఞాపాలనను అంగీకరిస్తున్నట్లయితే మీరు పవిత్రమైనవిగా భావించి అనుసరిస్తున్న నియమాలను వదలి మా నియమా లను (ఆజ్ఞలను) పాటించండి. కనుక ఇక్కడ కూడా ఆరాధన (ఇబాదత్) అనే పదాన్ని దాస్యం మరియు విధేయత అనే భావంతోనే వాడటం జరిగింది.

'ఇంకా ఇలా చెప్పు: "అల్లాహ్ వద్ద ఎవరి ముగింపు అవిధేయుల ముగింపు కంటే కూడా హీనతరంగా ఉంటుందో వారిని గురించి తెలియజేయనా? వారు అల్లాహ్ శాపగ్రస్తులు. వారిపై ఆయన ఆగ్రహం విరుచుకుపడింది. వారు కోతులుగా, పందులుగా

చెయ్యబడ్డారు. వారు తాగూత్ దాస్యం చేశారు".

*(అల్ మాయిద 5 : 60)*

"మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అందరికీ ఇలా హెచ్చరిక చేశాము: అల్లాహ్‌ను సేవించండి. మిథ్యాదైవాల (తాగూత్) దాస్యానికి దూరంగా ఉండండి."

*(అన్ నహ్ల 16 : 36)*

"తాగూత్ దాస్యాన్ని వదలి, అల్లాహ్ వైపునకు మరలే వారికి శుభవార్త ఉన్నది." *(జుమర్ 39 : 18)*

పై మూడు ఆయతులలో (వాక్యాలలో) తాగూత్ (మిథ్యాదైవాలు) 'ఇబాదత్' అంటే తాగూత్, దాస్యం, విధేయత అని అర్థం. ఇంతకు ముందు మేము వివరించినట్టు ఖుర్‌ఆన్ వివరణ ద్వారా తెలిసేదేమిటంటే, తాగూత్ అనగా ఈ ప్రపంచంలో దైవాదేశాలకు వ్యతిరేకంగా తమ శాసనాన్ని చెలాయించడానికి ప్రయత్నించే రాజ్యాధికారులు, మత పెద్దలు అని అర్థం. వారు ప్రజలను భయప్రలోభాలకు గురిచేసి లేదా మార్గభ్రష్ట బోధనలతో తమ దాసులుగా చేసుకుంటారు. ఇలాంటి ప్రతీవారి ముందు తమ శిరస్సులను వంచి వారి ఆజ్ఞలనే శాసనాలుగా భావించడం కూడా తాగూత్ దాస్యమే అవుతుంది.

## విధేయత అనే అర్థంలో ఇబాదత్

ఇప్పుడు ఇబాదత్ అనే పదాన్ని రెండవ భావార్థంలో ఉపయోగించిన ఖుర్‌ఆన్ వాక్యాలను పరిశీలిద్దాం.

"ఆదమ్ సంతానమా! నేను మీకు ఉపదేశించలేదా, షైతాన్‌కు దాస్యం చెయ్యవద్దని. వాడు మీకు బహిరంగ శత్రువని?" *(యాసీన్ : 60)*

వాస్తవమేమంటే ఈ ప్రపంచంలో ఎవరు కూడా షైతాన్‌ను ఆరాధిం

చరు. పైగా వాడికి శాపనార్థాలు పెడతారు. రేపు ప్రళయదినాన అల్లాహ్ తరఫున ఆదం సంతతిపై మోపబడే నేరం, "మీరు షైతాన్‌ను ఎందుకు ఆరాధించారు? అన్నది కాదు. మీరు షైతాన్ చూపిన మార్గాన ఎందుకు నడిచారు? వాడి ఆదేశాలను ఎందుకు అనుసరించారు?" అన్న నేరం మీదా, ఇంకా అది ఎటు వైపు వెళ్ళమంటే అటు వైపు పరుగెత్తినందుకు మాత్రమే ప్రశ్నించబడతారు.

> "(తీర్పుదినాన అల్లాహ్ తరఫు నుండి ఆజ్ఞ అవుతుంది). దుర్మార్గులం దరినీ, వారి సహచరులనూ, దేవుణ్ణి కాదని వారు ఆరాధిస్తూ ఉండిన దైవాలనూ చుట్టుముట్టి తీసుకురండి. తరువాత వారందరికీ నరకానికి దారి చూపండి."
>
> ...వారు ఒకరి వైపునకు మరొకరు తిరిగి పరస్పరం వాదించుకోవటం ప్రారంభిస్తారు. ఆరాధించిన వారు ఇలా అంటారు: మీరు మా వద్దకు మా శ్రేయోభిలాషులని భ్రమ కల్పించి కుడి వైపు నుండి వచ్చేవారు. వారు ఇలా సమాధానం ఇస్తారు: "అది కాదు, అసలు మీరే విశ్వసించే వారుకారు. మీ మీద మాకు అధికారం లేదు, మీరు సహజంగానే తలబిరుసువాళ్ళు." *(అస్ సాఫ్ఫాత్ : 22-30)*

పై వాక్యాలలో, దాసులు మరియు ఆరాధ్యుల మధ్య జరిగిన ప్రశ్నోత్త రాలను పరిశీలించినట్లయితే స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే, ఇక్కడ ఆరాధ్యులు అంటే పూజింపబడే విగ్రహాలు, దేవతలు కాదు. వాస్తవానికి వారు మతాచార్యులు, పీష్వాలే. వారు తమ ప్రత్యేకమయిన సాష్టాంగాలతో, జపమా లతో, పెద్దపెద్ద జుబ్బాలతో, దుశ్శాలువాలతో దైవదాసులను మోసగించి, వాళ్ళను తమ శిష్యులుగా చేసుకున్నారు. 'శ్రేయోభిలాషులం, సంస్కర్తలం' అంటూనే అరాచకాన్ని, అల్లకల్లోల్లాల్ని సృష్టించారు. ఇలాంటి వారిని గుడ్డిగా అనుసరిస్తూ, నోరు మెదపకుండా వారి ఆజ్ఞాపాలన చేయడాన్నే ఇక్కడ 'దాస్యం'గా పేర్కొనడం జరిగింది.

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు. ఇంకా ఇదేవిధంగా మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి ఒకే దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు". *(అత్ తౌబా 9 : 31)*

ఇక్కడ పండితులను, సన్యాసులను ప్రభువులుగా భావించి వారిని ఆరాధించడమంటే అర్థం, వారి ఆజ్ఞలనే శిరోధార్యంగా చేసుకోవడం. ఇంకా ఈ విషయంలో 'అల్లాహ్ మరియు ప్రవక్త (స) ఆదేశాలు ఏమిటి?' అని చూడకుండా వారి ఆజ్ఞలను శిరసావహించటం. దీని వివరణ ప్రవక్త ముహమ్మద్ (స) గారి ఒక ప్రవచనంలో లభిస్తుంది. "మేము పండితులకు, సన్యాసులకు ఏనాడూ దాస్యం చేయలేదు" అని అన్నప్పుడు ప్రవక్త (స) ఇలా అన్నారు. "వారు ఏ విషయాన్నయితే ధర్మసమ్మతమైనది(హలాల్)గా ఖరారు చేశారో దాన్ని ధర్మమైనదిగా, ఇంకా దేన్ని అధర్మమైనది(హరామ్)గా చేశారో దాన్ని మీరు అధర్మమైనదిగా చేసుకోలేదా?"

## పూజించటం అనే భావంలో ఇబాదత్

ఇప్పుడు మూడవ అర్థంలో ఆరాధనను గురించి వివరించిన వాక్యాలను పరిశీలిద్దాం. ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఖుర్‌ఆన్ పరిభాషలో 'పూజ' అనే పదంతో రెండు భావాలు ఇమిడి ఉన్నాయి–

ఒకటి: ఎవరి ముందైనా సాష్టాంగపడటం. వంగటం, పంక్తులు తీరి నిలబడటం, ప్రదక్షిణలు చేయడం, చుంబించడం, మొక్కుబడులు చెల్లించుకోవటం, ఖుర్బానీ ఇవ్వడం మొదలైనవన్నీ చేయడం. ఇవన్నీ ఆరాధన ఉద్దేశంతో చేసిందే తప్ప వారే ఆరాధ్యులని భావించి చేసింది కాదు. లేదా పెద్ద దేవుని వద్ద తమ గురించి సిఫారసు చేస్తారని భావించి ఆరాధించలేదు. రెండవది, తమ పండితులకు ఈ విశ్వవ్యవస్థ నిర్వహణలో కాస్తయినా పట్టు (అధికారం) ఉన్నదని భావించి తమ అవసరాలు తీర్చే వారిగా తలచి

వేడుకోవడం, కష్టసమయంలో, ఆపద సమయంలో తమకు సహాయం చేయగలరని భావించి పిలువడం, నష్టాల నుండి ఆపదల నుండి కాపాడబడటానికి వారి శరణు కోరడం.

ఈ రెండు విధాలైన పనులు ఖుర్ఆన్‌లో పూజ అన్న అర్థంలో వాడటం జరిగింది.

ఉదాహరణకు,

ఇలా అను, "అల్లాహ్‌ను కాదని మీరు వేడుకుంటున్న వారి ఆరాధన చేయకూడదని నన్ను వారించటం జరిగింది. నా ప్రభువు వైపు నుండి నా వద్దకు స్పష్టమైన సూచనలు వచ్చాక నేను ఈ పనిని ఎలా చేయగలను". *(మూ'మిన్ : 66)*

ఇబ్రాహీమ్ (అలై) ఇలా అన్నాడు: "నేను మిమ్మల్ని మరియు మీరు దేవుణ్ణి కాదని ప్రార్థిస్తున్న శక్తులను కూడా విడిచిపోతున్నాను. నేను నా ప్రభువునే ప్రార్థిస్తున్నాను.... ఈ విధంగా అతను వారి నుండి, వారి అల్లాహ్‌యేతర ఆరాధ్యుల నుండి వేరైపోయినప్పుడు, మేము అతనికి ఇస్‌హాఖ్, యాఖూబ్‌ల వంటి సంతానాన్ని ప్రసాదించాము.

*(మర్యమ్ : 48,49)*

అల్లాహ్‌ను కాదని, ప్రళయం వచ్చే వరకు అతనికి సమాధానమైనా ఇవ్వలేని వారిని మొరపెట్టుకునేవారు, తమను మొరపెట్టుకుంటున్నారనే విషయం కూడా ఎరుగని వారిని వేడుకునే వాడికంటే పరమ భ్రష్టుడైన మానవుడు ఎవుడు ఉంటాడు? మానవులనందరినీ సమావేశ పరచినప్పుడు, వారు తమను వేడుకున్న వారికి విరోధులై పోతారు, వారి ఆరాధనను తిరస్కరిస్తారు.[1] *(అహ్‌ఖాఫ్ : 5-6)*

---

1. *అనగా వారు నిర్మొహమాటంగా ఇలా అనేస్తారు: సహాయం కోసం మమ్మల్ని మొరపెట్టుకోమని మేము వారికి ఎన్నడూ చెప్పలేదు. వారు మమ్మల్ని వేడుకున్నారనే విషయం కూడా మాకు తెలియదు.*

పై మూడు వాక్యాలలో ఇబాదత్ అన్న పదానికి అర్థం ప్రార్థించడం, సహాయం కోసం పిలువడమని స్వయంగా ఖుర్ఆనే వివరణ ఇచ్చింది.

"పైగా వారు జిన్నాతులను ఆరాధించేవారు, వీరిలో చాలా మంది వారినే విశ్వసించారు". *(సబా : 41)*

పై వాక్య వివరణ సురెజిన్‌లో ఇలా ఉంది.

"మానవులలో కొందరు జిన్నాతులలోని కొందరిని శరణు వేడు తుండేవారు. *(జిన్న్ : 6)*

దీన్నిబట్టి తెలిసిందేమిటంటే, జిన్నుల ఆరాధన అంటే వారిని శరణు కోరడం, ఇంకా ఆపదలలో కష్ట సమయాలలో రక్షించమని వారిని వేడు కోవడం. ఇంకా వారిని విశ్వసించడం అంటే వారు తమకు రక్షణ కల్పిస్తారని, రక్షించగల శక్తివారికి ఉందని నమ్మటం.

ఏ రోజున అయితే అల్లాహ్‌ను కాదని వారు పూజిస్తున్న దేవుళ్ళను వారితో సమావేశపరుస్తాడో అప్పుడు వారిని అడుగుతాడు, "నా ఈ దాసులను మీరే మార్గం తప్పించారా లేక స్వయంగా వారే రుజుమార్గం తప్పిపోయారా?" అప్పుడు వారు ఇలా విన్నవించుకుంటారు. "నీవు అత్యంత పరిశుద్ధుడవు. నిన్ను తప్ప మరొకరిని మా రక్షకుడుగా చేసుకోవటం మీకు తగదు." *(ఫుర్ఖాన్ : 17,18)*

ఇక్కడ వివరించిన తీరునుబట్టి చూస్తే స్పష్టంగా అర్థమయ్యే విషయ మేమిటంటే, 'పూజ్యులు' అంటే ప్రవక్తలు, పుణ్యపురుషులు అని అర్థం. వారిని పూజించటం అంటే వారు మహోన్నతులని, దైవిక గుణాలు గలవారని, అగోచర జ్ఞానం కలవారని, కష్టాలలో తమ వేడుకోలు వింటారని భావించి వారి దాస్యం చేయడం. ఇంకా వారి మ్రొక్కులు చెల్లించడం వంటివి చివరికి పూజించడం, ఆరాధించటం అన్న భావన వరకు చేరుస్తాయి.

ఆయన మానవులందరినీ సమావేశపరచే రోజున దైవదూతలను "వీరు మిమ్మల్నే ఆరాధిస్తూ ఉండేవారా" అని అడుగుతాడు. అప్పుడు వారు ఇలా చెబుతారు: "నీవు పరిశుద్ధుడవు. మా సంబంధం నీతోనే గాని వీరితో మాత్రం కాదు." *(సబా : 40,41)*

ఇక్కడ దూతల ఆరాధన అనగా వారి విగ్రహాలను తయారు చేసి, మందిరాలు నిర్మించి, ఊహాచిత్రాలను తయారుచేసుకుని వారిని పూజించడం అని అర్థం. ఈ పూజ అసలు ఉద్దేశ్యం, వారిని సంతోషపరచి లేదా వారికి మొక్కులు చెల్లించి వారి దృష్టి తమ వైపు మరల్చుకుని తమ ప్రాపంచిక అవసరాలలో సహాయం పొందటానికి ప్రయత్నించడమే.

ఈ ప్రజలు అల్లాహ్‌ను కాదని తమకు నష్టాన్నిగానీ, లాభాన్ని గానీ కలిగించలేని వారిని పూజిస్తున్నారు. పైగా ఇలా అంటున్నారు: "వారు అల్లాహ్ వద్ద మా కొరకు సిఫారసు చేస్తారు." *(యూనుస్ : 18)*

ఎవరైతే అల్లాహ్‌ను వదలివేసి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నారో, (తమ ఈ చర్యకు కారణంగా), "వారు మమ్మల్ని అల్లాహ్ వద్దకు చేరుస్తారని మాత్రమే మేము వారిని ఆరాధిస్తున్నాము" అని అంటారు. *(జుమర్-3)*

ఇక్కడ కూడా ఇబాదత్ (ఆరాధన) అనగా పూజించటం అనే అర్థం. ఎందుకు పూజిస్తున్నారు అన్న దానిని కూడా తెలియజేయడం జరిగింది.

## దాస్యం, విధేయత మరియు పూజ అనే భావనలో ఇబాదత్ (ఆరాధన)

పై ఉదాహరణల ద్వారా ఖుర్ఆన్‌లో ఆరాధన అనే పదాన్ని కొన్ని చోట్ల దాస్యం లేక విధేయత అనే భావనతో కొన్ని చోట్ల కేవలం విధేయత అనే

భావనతో, కొన్ని చోట్ల కేవలం పూజ అనే భావనతో ఉపయోగించినట్లు చాలా స్పష్టంగా తెలుస్తుంది. ఇప్పుడు ఆరాధన అనే పదాన్ని పై మూడు భావాలలోనూ వాడిన ఖుర్‌ఆన్ వాక్యాలను ఉదాహరణలుగా తెలియజేయదలచుకున్నాను. బాగా గుర్తుంచుకోవలసిన విషయమేమిటంటే, పైన పేర్కొన్న ఉదాహరణ లన్నింటిలోనూ అల్లాహ్‌కు కాక ఇతరుల ఆరాధన ప్రస్తావన వచ్చింది. ఎక్కడయితే ఆరాధన అనే పదాన్ని దాస్యం లేదా విధేయత అనే భావనలో ఉపయోగించామో అక్కడ ఆరాధ్యులు లేదా షైతాన్ అన్న ప్రస్తావన వచ్చింది. ఇంకా తాగూత్‌గా (దైవధిక్కార పనులు చేసేవాడిగా) మారిన దైవతిరస్కారి, దైవదాసులతో దేవుణ్ణి కాక తనకు దాస్యం లేదా విధేయత చూపేలా చేశాడు లేక దైవాదేశాలను కాదని తానే స్వయంగా నిర్ణయించిన మార్గంలో ప్రజలను నడిచేలా చేశాడు. ఎక్కడైతే ఆరాధన అనే పదాన్ని పూజ అనే భావంలో ప్రయో గించటం జరిగిందో అక్కడ సన్యాసులు, ప్రవక్తలు మరియు పుణ్యపురుషులను వారి బోధనలు, ఉపదేశాలకు విరుద్ధంగా వారిని ఆరాధ్యులుగా చేసుకున్నారు. దేవుని సర్వసత్తా కాధికారంలో భాగస్వాములుగా భావించి జిన్నులను, దైవ దూతలను దైవత్వంలో భాగస్వాములుగా చేసుకున్నారు. కేవలం షైతాన్ ప్రేరణతో ఊహాజనిత విగ్రహాలను దైవాలుగా భావించి వాటిని ఆరాధనలో ముఖ్య భాగంగా చేసుకున్నారు. ఖుర్‌ఆన్ ఈ అన్నిరకాల ఆరాధ్యులను బూటకంగా, వారి ఆరాధన సరైనది కాదని ఖండించింది. అది వారికి దాస్యం చేసినా లేక విధేయత చూపినా లేదా పూజించినా సరే. ఖుర్‌ఆన్ ఏమంటుం దంటే, ఎవరి ఆరాధన అయితే మీరు చేస్తున్నారో వారందరూ దేవుని దాసులు, ఆయన బానిసలు. పూజలందుకునే ఎలాంటి అర్హతా వారికి లేదు. ఒకవేళ మీరు వారిని ఆరాధించినట్లయితే దానివల్ల మీకు అవమానం, వైఫల్యం తప్ప మరేమీ లభించదు. వాస్తవానికి వారికి, సమస్త విశ్వానికి యజమాని అల్లాహ్ మాత్రమే. సర్వాధికారాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. కనుక ఆరాధనకు అర్హుడు అల్లాహ్ తప్ప మరెవ్వరూ కాదు.

"అల్లాహ్‌ను కాదని వీరు వేడుకుంటున్న వారు మీ మాదిరిగానే కేవలం దాసులు. మీరు వారిని ప్రార్థించి చూడండి. మీకు వారి పట్ల ఉన్న భావాలు నిజమే అయితే మీ ప్రార్థనలకు వారు సమాధానం ఇవ్వాలి[1].... మీరు అల్లాహ్‌ను వదలి వేడుకునేవారు మీకూ సహాయం చెయ్యలేరు, స్వయంగా తమకూ సహాయం చేసుకోలేరు.

*(ఆరాఫ్: 194 మరియు 197)*

వారు "కరుణామయుడు, కొడుకును కలిగి ఉన్నాడు" (వారు కృంచే ఈ మాటలకు అల్లాహ్ అతీతుడు) అని అంటారు. అల్లాహ్ ఎంతో పరిశుద్ధుడు. వారు (దైవదూతలు) దాసులు, వారికి గౌరవం ఇవ్వబడింది. వారు ఆయన సాన్నిధ్యంలో ముందుకు వచ్చి మాట్లాడరు. కేవలం ఆయన ఆజ్ఞ ప్రకారమే నడుచుకుంటారు. ఆయన వారికి ముందు ఉన్న దానినీ ఎరుగును, వారికి గుప్తంగా ఉన్న దానినీ ఎరుగును. వారు ఎవరిని గురించీ సిఫారసు చేయరు, సిఫారసు వినటానికి అల్లాహ్ ఇష్టపడిన వాని విషయంలో తప్ప. ఆయన భయం వల్ల వారు భీతావహులై ఉంటారు. *(అంబియా : 26–28)*

"దయామయుడైన దేవుని ప్రత్యేక దాసులైన దైవదూతలను వారు స్త్రీలుగా నిర్ణయించారు." *(అల్ జుఖ్రుఫ్ : 19)*

"వారు అల్లాహ్‌కూ, జిన్నాతులకు మధ్య రక్త సంబంధాన్ని కల్పించారు. వాస్తవానికి వారు నేరస్థులుగా ప్రవేశపెట్టబడేవారని జిన్నాతులకు కూడా బాగా తెలుసు." *(సాఫ్ఫాత్ : 158)*

"తాను అల్లాహ్‌కు దాసుడుగా ఉండటాన్ని మసీహ్ అగౌరవంగా భావించలేదు. అల్లాహ్‌కు అత్యంత సన్నిహితంగా ఉండే దూతలు

---

1. జవాబు ఇవ్వడం అంటే తిరిగి మాటల ద్వారా సమాధానం ఇవ్వడమని అర్థం కాదు. జవాబు ఇవ్వడమంటే వారి మొరలను ఆలకించి వారి అవసరాలను తీర్చటమని అర్థం.)

కూడా దీనిని తమకు అగౌరవంగా భావించరు. అల్లాహ్ దాస్యాన్ని తనకు అగౌరవమైనదిగా భావించేవాడు, అలా భావిస్తూ విర్రవీగేవాడు, అల్లాహ్ అందరినీ పోగుచేసి తన ముందు హాజరుపరచబోయే ఒక సమయం వస్తుంది అని తెలుసుకోవాలి." *(అన్ నిసా : 172)*

"సూర్యుడూ, చంద్రుడూ ఒక నియమావళికి కట్టుబడి ఉన్నారు. నక్షత్రాలు, వృక్షాలూ అన్నీ సాష్టాంగపడుతూ ఉన్నాయి."

*(అర్రహ్మాన్ : 5,6)*

"ఆయన పరిశుద్ధతను సప్తాకాశాలూ, భూమీ, భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ కొనియాడుతున్నాయి. ఆయన స్తోత్రంతోపాటు ఆయన పరిశుద్ధతను కొనియాడనటువంటిది ఏదీలేదు. కాని మీరు వాటి స్తుతిని అర్థం చేసుకోలేరు". *(బనీ ఇస్రాయీల్ : 44)*

"ఆకాశాలలో, భూమిపై ఉన్న వారెవరైనా ఆయన దాసులే. అందరూ ఆయన ఆజ్ఞకే కట్టుబడి వున్నారు." *(అర్రూమ్ : 26)*

"ఏ ప్రాణి జుట్టు అయినా ఆయన చేతులలో లేకుండా లేదు."

*(హూద్ : 56)*

"భూమ్యాకాశాలలో ఉన్న వారందరూ ఆయన సమక్షంలో దాసులుగా హాజరుకానున్నారు. ఆయన అందరినీ పరివేష్టించి ఉన్నాడు. వారిని సరిగ్గా లెక్కపెట్టి ఉంచాడు. ప్రళయంనాడు అందరూ ఆయన ముందు ఒక్కొక్కరే హాజరవుతారు". *(మర్యమ్ : 93-95)*

ఇలా అను: "ఓ అల్లాహ్! విశ్వసామ్రాజ్యాధిపత్యానికి ప్రభూ! నీవు కోరిన వారికి ప్రభుత్వాధికారాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారి నుండి దాన్ని లాక్కుంటావు. నీవు కోరిన వారికి గౌరవాన్ని ప్రసాదిస్తావు. నీవు కోరిన వారిని పరాభవంపాలు చేస్తావు. శుభాలు నీ అధీనంలో ఉన్నాయి". *(ఆలి ఇమ్రాన్ : 26)*

ఈ విధంగా ఏ రూపంలోనైనా ఎవరినైతే వీరు ఆరాధిస్తున్నారో వారం దరూ అల్లాహ్ దాసులేనని, వారికి ఏ విధమయిన అధికారం, ఆధిపత్యం లేదని నిరూపించిన తరువాత జిన్నులు, మానవులనందరినీ ఖుర్‌ఆన్ కోరేది ఒక్కటే. అదేమిటంటే, ఆరాధనలో ఎన్ని భావనలయితే ఉన్నాయో వాటన్నింటి ప్రకారం, ఆరాధన కేవలం అల్లాహ్‌కు మాత్రమే చేయాలి. దాస్యం, విధేయత కేవలం ఆయన కొరకే. పూజ కూడా కేవలం ఆయనకే జరగాలి. ఇందులో ఇతరులకు దాస్యం చేయాలన్న భావన కనీసం మదిలో కూడా రాకూడదు.

మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అందరికీ ఇలా హెచ్చరిక చేశాము:"అల్లాహ్‌ను ఆరాధించండి. మిథ్యాదైవాల ఆరాధనకు దూరంగా ఉండండి." *(అన్ నహ్ల్ 16 : 36)*

"తాగూత్ దాస్యాన్ని విసర్జించి అల్లాహ్ వైపునకు మరలే వారికి శుభవార్త ఉన్నది". *(జుమర్ : 17)*

"ఆదమ్ సంతానమా! నేను మీకు ఉపదేశించలేదా; షైతానుకు దాస్యం చెయ్యవద్దని, వాడు మీకు బహిరంగ శత్రువని, నా దాస్యమే చెయ్యండి ఇదే సరైన మార్గం అని. " *(యాసీన్ : 60,61)*

"వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు. .... వాస్తవానికి, ఒకే దేవుని దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారికి ఇవ్వబడలేదు". *(తౌబా : 31)*

"విశ్వసించిన ప్రజలారా! నిజంగానే మీరు మా ఆరాధకులు అయితే, మేము మీకు ప్రసాదించిన పరిశుభ్రమైన వస్తువులను నిస్సంకోచంగా తినండి, అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపండి". *(బఖర : 172)*

పై ఆయత్‌లలో (వాక్యాలలో) దాస్యం, విధేయత మరియు ఆజ్ఞాబద్ధులై ఉండే భావనతో చేసే ఆరాధన కేవలం అల్లాహ్ కొరకే ప్రత్యేకించుకునే ఆజ్ఞ ఇవ్వబడింది. ఇంకా తాగూత్, షైతాన్, పండితుల, సన్యాసుల, మతాధిపతుల,

పూర్వీకుల దాస్యాన్ని, విధేయతను మానుకుని విధేయత, దాస్యం కేవలం అల్లాహ్ కొరకు మాత్రమే ప్రత్యేకించుకోవాలని తెలియజేయడం జరిగింది.

"అల్లాహ్‌ను కాదని మీరు వేడుకుంటున్న వారి ఆరాధన చేయకూడదని నన్ను వారించటం జరిగింది. నా ప్రభువు వైపు నుండి నా వద్దకు స్పష్టమైన సూచనలు వచ్చాయి. సకల లోకాల ప్రభువుకు విధేయత చూపాలని నన్ను ఆజ్ఞాపించడం జరిగింది." *(మూమిన్ : 66)*

నీ ప్రభువు ఇలా అంటున్నాడు, "నన్ను ప్రార్థించండి, నేను మీ ప్రార్థనను అంగీకరిస్తాను. గర్వానికి లోనై నా ఆరాధనకు విముఖులయ్యేవారు తప్పనిసరిగా అవమానానికి, పరాభవానికీ గురి అయి నరకంలో ప్రవేశిస్తారు". *(మూమిన్ : 60)*

"అల్లాహ్‌యే మీ ప్రభువు, సామ్రాజ్యాధికారం ఆయనదే. ఆయనను కాదని మీరు పిలిచే ఇతరులు కనీసం ఒక గడ్డిపోచకు కూడా యజమానులు కారు. వారిని వేడుకుంటే, వారు మీ ప్రార్థనలను వినలేరు. ఒకవేళ విన్నా, వాటికి ఏ సమాధానమూ మీకు ఇవ్వలేరు. మీరు కల్పించిన దైవత్వపు భాగస్వామ్యాన్ని వారు ప్రళయం నాడు తిరస్కరిస్తారు". *(ఫాతిర్ : 13,14)*

ఇలా అను: "ఇదేమిటి, మీరు అల్లాహ్‌ను వదలి, మీకు నష్టంగాని, లాభంగాని కలిగించే అధికారంలేని దానిని పూజిస్తున్నారు? అందరిదీ వినేవాడూ, అంతా తెలిసినవాడూ అల్లాహ్ మాత్రమే."

*(అల్ మాయిద: 76)*

ఈ వాక్యాలలో పూజ అనే భావనతో చేసే ఆరాధన కేవలం అల్లాహ్ కొరకే ప్రత్యేకించబడాలని ఆజ్ఞాపించడం జరిగింది. అలాగే ఆరాధన అనే పదాన్ని ప్రార్థించడం లేక వేడుకోవడం అనే భావనలో కూడా వాడినట్లు స్పష్టమవుతుంది. మిగతా కొన్ని వాక్యాలలో సర్వాధికారాలకు స్వామి అయిన

అల్లాహ్‌కు భాగస్వాములుగా నిలబెట్టిన ఆరాధ్యుల ప్రస్తావన కూడా వచ్చింది.

ఇక వివేచన, విచక్షణాజ్ఞానాలున్న ఎవరికైనా ఖుర్‌ఆన్‌లో ఏ ఏ భావన లతో అయితే ఆరాధన ప్రస్తావన వచ్చిందో అందులో ఏ రూపంలో కూడా ఎవరికైనా రవ్వంత కూడా భాగస్వామ్యం లేదు అన్న విషయాన్ని గ్రహించటం ఏమంత కష్టమైన పనికాదు. అంటే దాస్యం, విధేయత మరియు పూజ అనే భావనలో ఆరాధనకు అర్హుడు కేవలం అల్లాహ్ మాత్రమే. ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలను చూడండి.

"నేనే అల్లాహ్‌ను, నేను తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు నాకు దాస్యం చెయ్యి." *(తాహా : 14)*

"ఆయనే అల్లాహ్. మీ ప్రభువు. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. ఆయన సర్వానికీ సృష్టికర్త. కనుక మీరు ఆయననే ఆరాధించండి. ఆయన ప్రతిదానికీ సంరక్షకుడు" *(అల్ అన్‌ఆమ్ : 102)*

ప్రవక్తా (స)! ఇలా అను: "మానవులారా! మీరు గనుక ఇంకా నా ధర్మం గురించి ఏదైనా సంశయం కలిగి ఉంటే, వినండి, మీరు అల్లాహ్‌ను కాదని ఆరాధించేవారిని నేను ఆరాధించను. ఏ దేవుని అధీనంలో మీ మరణం ఉన్నదో ఆ దేవుడినే నేను ఆరాధిస్తాను. నేను విశ్వాసులలో ఒకడిగా ఉండాలని నాకు ఆదేశం ఇవ్వబడింది". *(యూనుస్ : 104)*

ఆయనను (అల్లాహ్‌కు) కాదని మీరు దాస్యం చేస్తున్నవారు, మీరూ మీ తాతముత్తాతలూ కల్పించుకున్న కొన్ని పేర్లు మాత్రమే తప్ప మరొకటేమీ కాదు. వారి కొరకు అల్లాహ్ ఏ నిదర్శనాన్నీ అవతరింప జెయ్యలేదు. పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరొకరెవరికీ లేదు. ఆయనను తప్ప మీరు ఎవరి దాస్యాన్నీ చెయ్యకూడదని ఆయన ఆజ్ఞ. ఇదే శుద్ధమైన, సరియైన జీవిత విధానం (ధర్మం).

*(యూసుఫ్ 12 : 40)*

"ఆకాశాలలో, భూమిలో దాగివున్నదంతా అల్లాహ్ అధీనంలో ఉన్నది. అన్ని విషయాలు ఆయన వైపునకే మరలింపబడతాయి. కనుక ప్రవక్తా! నీవు ఆయననే సేవించు, ఆయననే నమ్ముకో" *(హూద్ : 123)*

"మా ముందు ఉన్నదానికీ, మా వెనుక ఉన్నదానికీ, ఈ రెండింటి మధ్య ఉన్నదానికీ, ప్రతిదానికీ ప్రభువు ఆయనే. నీ ప్రభువు ఎన్నడూ మరచి పోయేవాడు కాడు. ఆకాశాలకూ, భూమికీ, భూమ్యాకాశాల మధ్య ఉన్న సర్వానికీ ఆయన ప్రభువు. కాబట్టి మీరు ఆయనకు దాస్యం చేయండి. ఆయన దాస్యంలోనే స్థిరంగా ఉండండి". *(మర్యమ్ : 64,65)*

కనుక తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవాడు సత్కార్యాలు చేయాలి. ఆరాధనలో తన ప్రభువుతోపాటు మరెవ్వరినీ చేర్చకూడదు. *(కహఫ్ : 110)*

ఈ వాక్యాలలో లేదా ఇలాంటివే మరికొన్ని వాక్యాలలో 'ఇబాదత్' (ఆరాధన) అనే పదాన్ని కేవలం పూజ, దాస్యం, విధేయత అనే భావానికే ప్రత్యేకం చేసుకోకపోవటానికి తగు కారణమేదీ కనిపించదు. వాస్తవానికి ఇటువంటి వాక్యాలతోనే ఖుర్‌ఆన్ తన పూర్తి సందేశాన్ని వ్యక్తపరుస్తుంది. వాస్తవానికి ఖుర్‌ఆన్ సందేశం ఏమిటంటే, దాస్యం, విధేయత, పూజ లేదా ఇటువంటి మరే భావనతోనైనా చేసే ఆరాధన కేవలం అల్లాహ్‌కు మాత్రమే చెందాలి. కనుక ఆరాధనను ఏదో ఒక ఇతర భావనకు పరిమితం చేయడ మంటే ఖుర్‌ఆన్ సందేశాన్ని కూడా ఏదో ఒక భావానికి పరిమితం చేయడమే. ఫలితంగా ఎవరయినా ఖుర్‌ఆన్‌లోని ఏదో ఒక పరిమితమైన భావనను చూసి విశ్వసిస్తే ఆచరణాత్మకంగా వారు ఖుర్‌ఆన్ సంపూర్ణ సందేశాన్ని అనుస రించడం సాధ్యం కాదు.

# దీన్ (ధర్మం)

## నిఘంటు పరంగా :

అరబీలో 'దీన్' అనే పదం పలు అర్థాల్లో వాడుకలో ఉంది.

1. ప్రాబల్యం, అధికారం, పరిపాలన, ఇతరులను విధేయత చూపక తప్పని పరిస్థితిని సృష్టించటం, అతనిపై తమ తిరుగులేని అధికార బలాన్ని (Sovereignity) ప్రయోగించటం, అతన్ని తన బానిసగా చేసుకుని, తన ఆదేశాలను శిరసావహించేలా చేయటం. ఉదాహరణకు, అరబీలో ఇలా అంటారు–

దానన్నాస అయిఖహరహుమ్ అలత్తాఅతి (అంటే జనులను విధేయత చూపేలా చేసుకున్నాడు)

దింతుహుమ్ ఫదాననా అయి ఖహర్తుహుమ్ ఫఅతావు (అంటే నేను వారిని లోబరుచుకున్నాను. వారు నా ఆజ్ఞలకు బద్ధులయ్యారు). దింతుల్ ఖౌమ అజ్‌లల్తుహుమ్ వస్తాబత్తుహుమ్ (నేను ఆ జాతివారిని లోబరచుకుని వారిని నా సేవకులుగా చేసుకున్నాను). దానర్రజులు ఇజాఅజ్జ (ఫలానా వ్యక్తి గౌరవనీయుడు, శక్తిమంతుడయ్యాడు). దింతుర్రజుల హమల్తుహు అలా మాయక్రహు (నేనతన్ని, అతనికి ఇష్టం లేకపోయినా అతనిచే ఆ పనిని చేయించగలిగాను)

దీన ఫులానున్ ఇజాహుమిల అలా మక్రూహీన (ఫలానా వ్యక్తి ఆ పనిని చేయటం తప్ప మార్గాంతరం లేని పరిస్థితి సృష్టించబడింది). దింతుహు అయి సుస్తుహు వ మలక్ తుహు (అంటే నేనతనిపై నా అధికారాన్ని చెలాయించాను. అతనిపై రాజ్యమేలాను). ఈ భావంలో హతయ్యుహ్ తన తల్లినుద్దేశించి ఇలా అన్నాడు :

**లఖద్ దుయ్యింది అమ్రు బనీకి హత్తా**

**తరక్తిహిమ్ అదఖ్ఖా మినత్తహీమి**

(నీవు నీ పిల్లలపై వారి బాగోగుల్ని చూసే పర్యవేక్షకురాలిగా చేయ బడ్డావు. చివరికి నీవు వారిని పిండికన్నా పలుచగా చేసివేశావు)

ఒక హదీసులో ఇలా వుంది : అల్ కయ్యిసు మన్ దాన నఫ్సహు వ అదల లిమా బాదల్ మౌతి (అంటే తన మనసుపై అదుపును సాధించి, తన పరలోక సాఫల్యానికి ఉపయోగపడే కర్మలను చేసుకున్నవాడే విజ్ఞుడు). ఈ అర్థంలోనే ఏదైనా ఒక రాజ్యాన్ని లేదా జాతిని లేదా తెగను జయించి తన ఆధిక్యతను చాటిన వ్యక్తిని 'దయ్యాన్' (తిరుగులేనివాడు)గా వ్యవహరిస్తారు. ఉదాహరణకు ఆషా అల్ హర్‌మాజీ దైవప్రవక్త(స)నుద్దేశించి ఇలా అంటాడు:

**"యా సయ్యిదన్నాసి వదయ్యానల్ అరబీ"** (ఓ ప్రజా నాయకుడా! ఓ అరబ్బు అధిపతీ!!)

ఈ భావంలోనే బానిసను 'మద్‌యన్' అనీ, దాసి లేక బానిసరాలిని 'మదీనహ్'అని అంటారు. 'ఇబ్నె మదీనహ్' అంటే దాసి పుత్రుడని అర్థం. ఖుర్‌ఆన్‌లో ఇలా వుంది :

> 'ఒకవేళ మీరు ఎవరికీ లోబడి ఉండని బానిస కాకపోతే చనిపోయేవాణ్ణి మృత్యువు నుండి ఎందుకు కాపాడలేరు? పోయే ప్రాణాన్ని మీరు తిరిగి ఎందుకు తీసుకురాలేరు?" *(అల్ వాఖిఅహ్- 86,87)*

2. విధేయత, దాస్యం, సేవ, ఎవరికైనా లోబడి ఉండడం, ఒకరి ఆజ్ఞలకు కట్టుబడి ఉండటం. ఒకరి ఆధిపత్యానికి లేదా బలానికి లొంగి అవమానాన్ని భరించడం. నేను వారిని వశపరుచుకున్నాను. వారు నా విధేయులయ్యారు. నేను ఫలానా వ్యక్తి సేవ చేశాను. ఒక ప్రవచనంలో ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: నేను ఖురేషి ప్రజలకు ఒక (కలిమా) సద్వచనం అనుస

రించేలా చేయాలనుకుంటున్నాను. ఒకవేళ వారు గనక దాని ప్రకారం నడిస్తే మొత్తం అరేబియా వారికి దాసోహమంటుంది. ఇదే భావంలో విధేయతను చూపే జాతిని "ఖౌమెదీన్" అని అంటారు. ఇదే భావంలో 'దీన్' అనే పదం 'ఖ్వారిజ్ హదీసు'లో ప్రయోగించబడింది.

3. చట్టం, ధర్మశాస్త్రం, పద్ధతి, మతం లేదా వర్గం, ఆచారం లేదా అలవాటు.

'ప్రతీసారి ఇదే నా పద్ధతి'. మంచి జరిగినా లేదా చెడు జరిగినా ఒకే విధానానికి కట్టుబడి ఉండే పద్ధతిని 'ధర్మం' అని అంటారు. ఒక ప్రవచనంలో ఖురేషి మరియు వారి జాతి వారు వారి సాంప్రదాయానికి కట్టుబడివున్నారు. మరో ప్రవచనంలో ముహమ్మద్ (స) ప్రవక్తగా నియుక్తులుకాకముందు తన జాతి వారు అనుసరించిన ధర్మంపైనే ఉన్నారు. అనగా పెళ్ళి, విడాకులు, వారసత్వం, ఇంకా ఇతర సామాజిక రాజకీయ విధానాలలో ఆయన, ఆయన జాతి వారి సాంప్రదాయాలకే కట్టుబడి వున్నారు.

4. కర్మల ప్రతిఫలం, బదులు, పారితోషికం, ఆత్మపరిశీలన, నిర్ణయం, అరబ్బి సామెత "కమాతదీనుతుదాను" అనగా నీవు ఎలాంటి పని చేస్తే అలాంటి ప్రతిఫలమే లభిస్తుంది అని అర్థం.

ఖుర్‌ఆన్‌లో దైవ తిరస్కారుల ఈ వాదన ప్రస్తావనకు వచ్చింది. "ఏమిటి? వేము మరణించిన తరువాత మా కర్మల లెక్కపత్రం తీసుకోబడుతుందా? కర్మల ప్రతిఫలం కూడా ఇవ్వబడుతుందా?"

ఒక ప్రవచనంలో అబ్దుల్లా ఇబ్నె ఉమర్ (రజి) గారు ఇలా ఉల్లేఖించారు: "మీరు, మీ పాలకులను గురించి చెడుగా మాట్లాడకండి. ఒకవేళ తప్పని సరిగా మాట్లాడవలసి వస్తే, ఇలా అనండి. ఓ ప్రభువా! వీళ్ళు ఏ విధంగా నయితే మాతో వ్యవహరించారో అదే విధంగా నీవు వీళ్ళతో వ్యవహరించు". ఇదే భావంతో ధర్మమనే పదాన్ని న్యాయాధిపతి, కోర్టు అనే అర్థాలలో కూడా

వాడతారు. ఒక పెద్ద మనిషితో హజ్రత్ అలీ (రఅ) గురించి 'ఆయన ఎలాంటి వాడు?' అని అడిగితే,

"ప్రవక్త (స) తరువాత ఉమ్మత్ (జాతి)కి ఆయన అందరికన్నా గొప్ప న్యాయాధికారి" అని సమాధానం ఇచ్చాడు.

## ఖుర్ఆన్‌లో దీన్ (ధర్మం) అనే పదాన్ని ఉపయోగించిన సందర్భాలు

ఈ వివరణ ద్వారా స్పష్టంగా తెలిసిందేమిటంటే, ధర్మమనే పదానికి నాలుగు రకాల మౌలిక భావాలున్నాయి. మరోవిధంగా చెప్పాలంటే అరబీ భాషలో ఈ నాలుగు పదాల భావాల నుండి మరో నాలుగు భావాల పదాలను అనువదించారు.

1. అధికారం గలవాని తరపు నుండి ఆధిపత్యం.
2. అధికారం కలవాని ముందు తలవంచనివాడు చూపే విధేయత.
3. ఏదేని ఒక నిబంధనావళిని రూపొందించుకుని, దానికి కట్టుబడటం.
4. ఆత్మపరిశీలన, నిర్ణయాలు, శిక్షాప్రతిఫలాలు.

ఇవే భావాలలో నుండి అరబ్బులు కొన్నిసార్లు మొదటి భావంతో, ఇంకోసారి మిగతా భావాలతో ధర్మమనే ఈ పదాన్ని ఉపయోగించేవారు. కాని వారిలో పై నాలుగు భావాల పట్ల స్పష్టమైన ఒక అభిప్రాయం లేదు. అంతేకాక దానికి అంతగా ప్రాధాన్యత కూడా ఇచ్చేవారు కాదు. అందుకే ఈ పద వాడుక అనేక అపోహలకు గురిచేసేది. ఈ కారణంగానే ఈ పదం ఏదేని ఒక సైద్ధాంతిక వ్యవస్థకు సంబంధించిన 'పరిభాష' కాలేకపోయింది. ఖుర్ఆన్ అవతరణ తరువాత అది తన ఉద్దేశ్యాన్ని ప్రకటించటాన్ని సరియైన పదంగా భావించి దాన్ని పూర్తి స్పష్టమైన సంపూర్ణ భావంతో ధర్మమనే ఈ పదాన్ని వాడింది. ఖుర్ఆన్ పరిభాషలో ధర్మమనే ఈ పదం ఒక సంపూర్ణ వ్యవస్థకు ప్రతిరూపం. దీని విశ్లేషణ ఈ క్రింది నాలుగు విషయాల ద్వారా తెలుసుకోవచ్చు.

1. రాజ్యాధిపత్యం, సార్వభౌమత్వం.
2. సర్వాధిపత్యాన్ని అంగీకరిస్తూ చూపే విధేయత.
3. ఆ రాజ్యాధిపత్యం క్రింద ఉన్న సైద్ధాంతిక వ్యవస్థ.
4. వ్యవస్థ పట్ల విశ్వసనీయత, విధేయత లేదా తిరస్కారం, ద్రోహం ఫలితంగా ఆ సర్వోన్నతాధికారి తరఫు నుండి లభించే శిక్షా బహుమానాలు.

ఖుర్‌ఆన్, దీన్ (ధర్మం) అనే ఈ పదాన్ని కొన్నిసార్లు మొదటి, రెండవ భావంలో, మరికొన్ని సార్లు మూడవ భావంలో, ఇంకొన్ని సార్లు నాల్గవ భావంలో కొన్ని చోట్ల 'సంపూర్ణ ధర్మం' అనే భావాన్ని ఉపయోగించి మొత్తం సంపూర్ణ వ్యవస్థను తన నాలుగు భావాలను కలిపి వ్యక్తమయ్యేలా చూస్తుంది.

దీని వివరణకై ఈ క్రింది ఖుర్‌ఆన్ వాక్యాలను గమనించాలి.

## 'ధర్మం' అనే పదం మొదటి మరియు రెండవ భావాలలో ...

"మీ కొరకు భూమిని నివాస స్థలంగా చేసినవాడూ, పైన ఆకాశాన్ని కప్పుగా నిర్మించినవాడూ, మీ రూపాన్ని తీర్చిదిద్దినవాడూ, దానిని ఎంతో చక్కగా మలచినవాడూ, మీకు పరిశుభ్రమైన పదార్థాలను ఆహారంగా ఇచ్చినవాడూ అల్లాహ్‌యే కదా! ఆ అల్లాహ్‌యే (ఈ పనులన్నీ చేసినవాడు) మీ ప్రభువు. ఆ విశ్వప్రభువు అసంఖ్యాకమైన శుభాలు కలవాడు. ఆయనే సజీవుడు. ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు ఎవ్వడూలేడు. ఆయననే మీరు వేడుకోండి, మీ ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకం చేసి, సకల ప్రశంసలూ సర్వలోకాలకూ ప్రభువైన అల్లాహ్‌కే చెందుతాయి." *(మోమిన్ : 64-65)*

"(ఓ ప్రవక్తా!) ఇలా చెప్పు, ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించి, ఆయనకు మాత్రమే దాస్యం చేయి అని నాకు ఆజ్ఞ ఇవ్వబడింది. అందరి కంటే ముందు స్వయంగా నేను ముస్లిమ్ అయిపోవాలని కూడా నాకు ఆజ్ఞ

ఇవ్వబడింది.... ఇలా చెప్పు, నేను మాత్రం నా ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించి, ఆయనకు మాత్రమే దాస్యం చేస్తాను. మీరు ఆయన దాస్యం తప్ప ఎవరెవరి దాస్యం చెయ్యదలచుకున్నారో, చేస్తూ ఉండండి.... దీనికి భిన్నంగా తాగూత్ దాస్యాన్ని విసర్జించి, అల్లాహ్ వైపునకు మరలే వారికి శుభవార్త ఉన్నది". *(జుమర్ : 11-17)*

"(ఓ ప్రవక్తా!) మేము ఈ గ్రంథాన్ని సత్యంతో నీపై అవతరింపజేశాము. కనుక నీవు ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకిస్తూ, అల్లాహ్‌కు మాత్రమే దాస్యం చెయ్యి. జాగ్రత్త! ధర్మం ప్రత్యేకంగా అల్లాహ్‌కు చెందిన హక్కు మాత్రమే." *(జుమర్ : 2,3)*

"ఆకాశాలలో ఉన్నదంతా, భూమిలో ఉన్నదంతా ఆయనదే. కేవలం ఆయన ధర్మం మాత్రమే అనుసరింపబడుతోంది. అలాంటప్పుడు మీరు అల్లాహ్‌ను కాదని మరొకరికి భయపడతారా?" *(అన్ నహ్ల్ : 52)*

ఇక ఈ ప్రజలు అల్లాహ్‌కు విధేయత చూపే విధానాన్ని (అల్లాహ్ ధర్మాన్ని) వదలిపెట్టి, మరొక విధానాన్ని దేన్నయినా కోరుతున్నారా ఏమిటి? వాస్తవంగా భూమ్యాకాశాలలో ఉన్న సకల వస్తువులూ ఇష్టం ఉన్నా ఇష్టం లేకపోయినా అల్లాహ్ ధర్మానికే (విధేయతకే) కట్టుబడి ముస్లిములై ఉన్నాయి. ఆయన వైపునకే అంతా మరలిపోవలసి ఉంది. *(ఆలి ఇమ్రాన్ : 83)*

"వారు అల్లాహ్‌కు దాస్యం చెయ్యాలని, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని ఆజ్ఞ ఇవ్వబడింది." *(అల్ బయ్యినహ్ : 5)*

పై వాక్యాలన్నింటిలో దీన్ (ధర్మం) అనే పదం ఆ విశ్వప్రభువు సర్వ సత్తాధికారాన్ని అంగీకరించి ఆయన విధేయత, దాస్యం చేయాలన్న భావంలోనే వాడబడినది. ధర్మాన్ని కేవలం, అల్లాహ్ కొరకే ప్రత్యేకించుకోవాలి. అనగా

మానవులు, ఈ విశ్వవ్యవస్థపై ఆధిపత్యం, ఆజ్ఞాధికారం, పరిపాలనాధి కారం కేవలం అల్లాహ్‌కు మాత్రమే చెందాలని నమ్మి, తన విధేయత, దాస్యం అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోవాలి. మరెవరి దాస్యాన్నీ, విధేయతను అల్లాహ్ విధేయత, దాస్యంతో చేర్చరాదు.

## మూడవ భావంలో దీన్ (ధర్మం)

"(ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను, "మానవులారా! మీరు గనక ఇంకా నా ధర్మం గురించి ఏదైనా సంశయం కలిగి వుంటే, వినండి, మీరు అల్లాహ్‌ను కాదని ఆరాధించే వారిని నేను ఆరాధించను. ఏ దేవుని అధీనంలో మీ మరణం ఉన్నదో ఆ దేవుడినే నేను ఆరాధిస్తాను. నేను విశ్వాసులలో ఒకడిగా ఉండాలని నాకు ఆదేశం ఇవ్వబడింది. నాతో ఇలా అనబడింది: ఏకాగ్రతతో, చిత్తశుద్ధితో నిన్ను నీవు పూర్తిగా ఈ ధర్మానికి సమర్పించుకో. ముష్రిక్కులలో ఎంత మాత్రమూ కలసిపోకు."

*(యూనుస్: 104, 105)*

"పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరొకరెవరికీ లేదు. ఆయనను తప్ప మీరు ఎవరి దాస్యాన్నీ చెయ్యకూడదని ఆయన ఆజ్ఞ."

*(యూసుఫ్ : 40)*

"ఆకాశాలలో, భూమిపై ఉన్న వారెవరైనా ఆయన దాసులే. అందరూ ఆయన ఆజ్ఞకే కట్టుబడి ఉన్నారు.... ఆయన మీకు స్వయంగా మీకే చెందిన ఒక ఉపమానాన్ని ఇస్తున్నాడు. మీ ఆధీనంలో ఉన్న బానిస లలో కొందరు మేము మీకు ఇచ్చిన సిరిసంపదలలో మీతోపాటు సమానమైన భాగస్వాములుగా ఉన్నవారూ, మీరు పరస్పరం మీ సమానులకు భయపడే విధంగా, మీరు భయపడేటటువంటి వారు వారిలో ఎవరైనా ఉన్నారా? ఈ విధంగా బుద్ధి కుశలత మేము సూచన లను స్పష్టంగా వివరిస్తాము. కాని ఈ దుర్మార్గులు జ్ఞానం లేకుండానే

తమ భ్రమల వెంట పడ్డారు. అల్లాహ్ అపమార్గం పట్టించిన వ్యక్తికి మార్గం చూపగలవాడెవడు? అటువంటి వారికి సహాయపడేవాడెవడూ ఉండడు.

.... అల్లాహ్ సృష్టించిన స్వరూప స్వభావాలు మార్చటానికి శక్యం కానివి.[1] ఇదే సవ్యమైన తిన్నని ధర్మంమార్గం, కాని చాలా మందికి తెలియదు". *(అర్రూమ్ : 26-30)*

ఇదే విధంగా చాలా మంది ముష్రిక్కులకు తమ సంతాన హత్యను, వారు నిలబెట్టిన భాగస్వాములు[2] సరైనదిగా కనిపించేలా చేశారు, వారిని వినాశానికి గురి చెయ్యటానికి, వారికి వారి ధర్మం సంశయాస్పదమైనదిగా చెయ్యటానికి.[3] *(అల్ అన్ఆమ్: 137)*

"అల్లాహ్ అనుమతించకుండానే, ధర్మం వంటి స్వభావం గల ఒక విధానాన్ని తమ కొరకు రూపొందించిన దైవభాగస్వాముల నెవరినైనా వారు కలిగి ఉన్నారా?" *(అష్ షూరా : 21)*

"మీ ధర్మం మీదే, నా ధర్మం నాదే." *(అల్ కాఫిరూన్ : 6)*

---

1. *అంటే అల్లాహ్ తన దాస్యం కొరకే మనిషిని సృజించాడు. ఈ సహజ గుణం ఎవరు మార్చినా మారనిది, మార్చజాలనిది, ఆయన ఉపాధి కల్పన, దైవత్వంలో ఎవరికీ భాగస్వామ్యం లేదు. అల్లాహ్ తప్ప మరో దేవుడు లేడు కనుక మానవుడు ప్రకృతి ధర్మాన్ని అనుసరించి అల్లాహ్‌కే దాస్యం చేయాలి. మరెవ్వరి దాస్యం చేయరాదు.)*
2. *ఇక్కడ భాగస్వాములుగా నిలబెట్టడమంటే దేవుని ఆజ్ఞలో మరియు ఆయన చేసిన శాసనాలలో దైవానికి సాటిగా నిలబెట్టడమని అర్థం.*
3. *ధర్మంలో సంశయాన్ని కలిగించడమంటే వారు చేసే పాపాలను దుర్మార్గపు ఆచారాలను వారి దృష్టిలో ధర్మసమ్మతమైన, ఇష్టపడదగిన పనులుగా చేసివేశారు. దీనితో అరబ్బులు సంశయంలో పడిపోయి బహుశా ఇది కూడా ధర్మంలో ఒక భాగమేనని భావించేవారు)*

పై వాక్యాలన్నింటి ద్వారా తెలిసేదేమిటంటే, మనిషి తన జీవిత కాలంలో అనునిత్యం క్రమం తప్పకుండా అనుసరించే శాసనం, చట్టం, పద్ధతి సైద్ధాంతిక వ్యవస్థ ఆచార వ్యవహారాలను 'ధర్మం' (దీన్) అని అంటారు. అలాగే ఒకరి అధికార ప్రాబల్యంతో నిర్ణయించిన పద్ధతిని లేక వ్యవస్థను తప్పనిసరిగా అనుసరించేలా చేసుకోవడాన్ని కూడా 'ధర్మం' అని అంటారు. అధికార ప్రాబల్యం దేవునిదే అయితే మనిషి దేవుని ధర్మంలో ఉన్నట్టు. ఒకవేళ అతడు ఏ రాజు ప్రాబల్యంలోనైనా ఉన్నట్లయితే అతడు ఆ రాజు ధర్మం (విధానంపై) ఉన్నట్టు. అలాగే అతడు పండితుల అధికారుల ప్రాబల్యంలో ఉన్నట్లయితే మనిషి వారి విధానంపైనే (ధర్మంపైనే) ఉన్నట్లు. అలాగే వంశపారంపర్య లేక స్వతంత్ర జాతుల ప్రాబల్యంలో ఉంటే మనిషి వారి ధర్మంపైనే ఉన్నట్టు, ఎవరి శాసనాన్ని శాసనంగా, ఎవరి నిర్ణయాన్ని అంతిమ నిర్ణయంగా భావించి మనిషి ఆ మార్గాన నడుస్తాడో, మనిషి అదే ధర్మాన్ని (విధానాన్ని) అనుసరిస్తాడు.

## నాల్గవ భావంలో ధర్మం

"వాస్తవం ఏమిటంటే, మిమ్మల్ని ఏ విషయం గురించి భయపెట్టటం జరుగుతుందో (అనగా మరణానంతర జీవితం గురించి) ఆ విషయం సత్యం, కర్మలకు ప్రతిఫలం లభించటం అనే పని తప్పకుండా జరగవలసి ఉంది". *(అల్ జారియాత్ 51 : 5-6)*

"పరలోక శిక్షను, బహుమానాన్ని (ధర్మాన్ని) తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా? అతడే అనాథులను కసిరికొట్టేవాడు, పేదవాళ్లకు అన్నంపెట్టు అని ప్రోత్సహించనివాడు". *(అల్ మాఊన్ : 1-3)*

"అవును, ఆ తీర్పు దినమేమిటో నీకేమైనా తెలుసా? ఆ రోజున ఏ మనిషి కొరకు ఏదైనా చెయ్యటమనేది ఎవరికీ సాధ్యం కాదు. ఆనాడు తీర్పు ఇచ్చే అధికారం పూర్తిగా అల్లాహ్ చేతుల్లోనే ఉంటుంది.'

*(ఇన్‌ఫితార్ : 17-19)*

ఈ వాక్యాలలో 'ధర్మం' అనే పదాన్ని ఆత్మావలోకనం, నిర్ణయం, కర్మల ప్రతిఫలం అనే భావాలలో వాడటం జరిగింది.

## సమగ్ర పరిభాషలో దీన్ (ధర్మం)

ఖుర్‌ఆన్‌లో ఇప్పటి వరకు ఉపయోగించిన ధర్మమనే పదం అరబ్బుల వాడుకలో ఉన్న భావాలకు దాదాపు సమానమైన భావాలలోనే వాడటం జరిగింది. కాని ఆ తరువాత మనం గమనించినదేమిటంటే, ఖుర్‌ఆన్ ఈ పదాన్ని ఒక విస్తృతమైన భావంలో వాడింది. దీని ప్రకారం, ధర్మమంటే ఒక మహోన్నతమైన జీవన విధానం. ఇందులో మనిషి ఒకరిని సర్వసత్తాక ప్రభువుగా శిరసావహించి, ఆయన విధేయత, ఆజ్ఞాపాలన తప్పనిసరి చేసుకోవాలి. ఆ పరిధిలోనే ఉంటూ ఆయన ఆదేశాలు, శాసనాలను పాటిస్తూ జీవించాలి. ఆయన ఆజ్ఞాపాలనలోనే గౌరవం, జీవన ఉన్నతి, బహుమానాలు లభిస్తాయని ఆశించాలి. ఆయన ఆదేశాల ధిక్కారంలోనే అగౌరవం, అవమానం, శిక్షకు గురికావలసి ఉందని భయపడాలి. ప్రపంచంలోని ఏ భాషలోనూ ఇంత విస్తృతమైన భావాలున్న పదం మరొకటి లేదు అంటే అతిశయోక్తి కాదు. ప్రస్తుత కాలంలో స్టేట్ (రాజ్యం) అన్న పదము దీన్ (ధర్మం) అనే పదానికి దరిదాపుల అర్థంగల పదంగా భావించినా, ధర్మం అనే పదంలో గల విస్తృతి అందులో రాదు.

ధర్మం (దీన్) సారాన్ని (భావాన్ని) తెలియజేసే కొన్ని వాక్యాలను ఈ క్రింద పొందుపర్చడం జరిగింది.

"గ్రంథ ప్రజలలో అల్లాహ్‌నూ(1-2) (అనగా ఆయననే ఏకైక సర్వాధిపతిగా) విశ్వసించని వారునూ అంతిమ దినాన్నీ విశ్వసించని వారునూ, అల్లాహ్, ఆయన ప్రవక్త నిషిద్ధంగా నిర్ణయించిన దానిని నిషిద్ధంగా భావించని వారునూ, ఇంకా సత్యధర్మాన్ని తమ ధర్మంగా

చేసుకోని వారునూ అయిన వారికి వ్యతిరేకంగా జిజియా ఇచ్చేవరకూ, లోబడి ఉండేవరకూ. (వారితో పోరాడండి)" (తౌబా -29)

ఈ ఆయతులలో సత్యధర్మం అన్న పదం ఒక పారిభాషిక పదం. ఈ పదము వివరణ అల్లాహ్‌నే స్వయంగా మూడు భావాలలో వివరించాడు. నేను అనువాదంలో ఆ భావాల వద్ద అంకెలను వేసి దీన్ (ధర్మం) నాలుగు భావాలలో ఏ భావానికి అనుగుణంగా తీసుకోబడిందో పేర్కొనడం జరిగింది. ఆ భావాలన్నింటి కలయికతో ఏర్పడిన పదమే సత్య ధర్మం.

"ఒక రోజు ఫిరౌన్ తన దర్బారు జనులతో ఇలా అన్నాడు, "నన్ను వదలండి, నేను ఈ మూసాను చంపివేస్తాను. ఇతడు తన ప్రభువును పిలిచుకోనివ్వండి. ఇతడు మీ మతాన్ని మార్చివేస్తాడేమో అని లేదా దేశంలో సంక్షోభాన్నీ రేకెత్తిస్తాడేమో అని నేను భయపడతున్నాను".

*(మూమిన్ : 26)*

ఖుర్ఆన్‌లో ఫిరౌన్ మరియు మూసా (అలై) లకు సంబంధించిన ఎన్నో సంఘటనలు చాలా వివరంగా వచ్చాయి. వాటన్నింటినీ పరిశీలిస్తే ధర్మం (దీన్) కేవలం 'మతం' అన్న భావనలో వాడబడలేదు అని చాలా స్పష్టంగా అర్థమవుతుంది. పైగా ఈ పదం రాజ్యం, పౌరజీవన వ్యవస్థ అన్న భావనలో వాడటం జరిగింది అని తెలుస్తుంది.

ఫిరౌన్ ఉద్దేశ్యం ప్రకారం, ఒకవేళ మూసా(అలై) గనక తన మిషన్‌లో (దైవధర్మం సంస్థాపనలో) కనుక విజయం సాధిస్తే ఇప్పుడున్న రాజ్య వ్యవస్థ స్వరూపమే మారిపోయి, ఇప్పటి వరకు నడుస్తున్న శాసనాలు, ఆఛార వ్యవహారాల పునాదులు కూకటివ్రేళ్ళతో పెకిలించివేయబడి కొత్తగా మరో జీవన విధానం ఉనికిలోకి వస్తుంది లేదా ప్రస్తుత వ్యవస్థ మొత్తం ఛిన్నాభిన్నమై పోయి రాజ్యంలో అరాచకం, సంక్షోభం ప్రబలిపోతుంది.

"అల్లాహ్ దృష్టిలో అసలు ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే."

*(ఆలి ఇమ్రాన్ : 19)*

"ఎవడైనా ఇస్లాంను (విధానాన్ని) కాక మరొక మార్గాన్ని అవలంబించదలిస్తే ఆ మార్గం ఎంత మాత్రం ఆమోదించబడదు".

*(ఆలి ఇమ్రాన్ : 85)*

"తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్నీ ఇచ్చి పంపినవాడు అల్లాహ్‌యే. దానిని ఇతర అన్ని జీవన వ్యవస్థలపై (ధర్మాలపై) ప్రబలింపజెయ్యాలని, ముష్రిక్కులకు ఇది ఎంత సహించరానిదైనా సరే". *(తౌబా : 33)*

"విశ్వసించిన ప్రజలారా! పీడన ఏ మాత్రం మిగులకుండా పోయే వరకు, అల్లాహ్ నిర్ణయించిన ధర్మం పూర్తిగా నెలకొల్పబడే వరకు ఈ అవిశ్వాసులతో యుద్ధం చెయ్యండి". *(అన్‌ఫాల్ : 39)*

"అల్లాహ్ సహాయం వచ్చినప్పుడు, విజయభాగ్యం లభించినప్పుడు, ప్రజలు తండోపతండాలుగా అల్లాహ్ ధర్మంలో ప్రవేశించటాన్ని నీవు చూసినపుడు (ప్రవక్తా) నీవు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరించు, ఇంకా ఆయన మన్నింపును వేడుకో. నిస్సందేహంగా ఆయన పశ్చాత్తాపాన్ని ఎంతగానో అంగీకరించేవాడు".

*(అన్ నస్ర్)*

పై వాక్యాలన్నింటిలో ధర్మం అంటే సంపూర్ణ జీవన విధానం అని భావం. విశ్వాసపరమైన, సైద్ధాంతికమైన, నైతికమైన, క్రియాత్మకమైన కోణాలన్నీ అందులో అంతర్లీనమై ఉన్నాయి.

మొదటి, రెండు వాక్యాలలో అల్లాహ్ వద్ద ఆమోదయోగ్యమైన జీవన

విధానం కేవలం ఆయనకు మాత్రమే విధేయత చూపి ఆయనకు మాత్రమే దాస్యం చేసే (ఇస్లాం) విధానమై ఉండాలి. ఈ విధానం కాక.... విధేయత చూపే ఏ విధానమైనా విశ్వప్రభువు వద్ద ఆమోద యోగ్యం కానేకాదు. ఎందు కంటే మనిషి తనను సృజించి, జీవన వసతులు కల్పించి తనను పోషించే స్వామి సామ్రాజ్యంలో ఒక ప్రతినిధిగా ఉంటూ, ఆ స్వామి లేక ప్రభువును కాక మరొకరి అధికార దాస్యం, విధేయత కలిగి జీవిస్తూ, ఇతరుల ఆదేశాల ఆజ్ఞాపాలన చేయడాన్ని ఆ విశ్వప్రభువు ఏ మాత్రం అంగీకరించడు.

మూడవ వాక్యం తెలియజేసింది ఏమిటంటే, అల్లాహ్ తన ప్రవక్త(స)కు సరైన, సత్యబద్ధమైన జీవిత విధానం అనగా (ఇస్లాం ధర్మం) ఇచ్చి పంపాడు. ఇప్పుడు ఆయన కర్తవ్యం ఏమిటంటే, ఆ ధర్మాన్ని ఇతర ధర్మాలపై (విధానాలపై) ఆధిక్యత వహించేలా చేయడం.

నాల్గవ వాక్యంలో ఇస్లాం విధానాన్ని అనుసరించే వారి పీడన (ఫిత్న) సమసిపోయేదాకా- అంటే లోకంలోని మిథ్యావాదాలు నామరూపాల్లేకుండా పోయేదాకా- పోరాడుతూ ఉండాలని ఆదేశించటం జరిగింది. అంటే మొత్తం వ్యవస్థ విధేయత, దాస్యం కేవలం అల్లాహ్‌కు మాత్రమే చేసేదాకా, దైవధిక్కారానికి ఒడిగట్టే విధానం కూకటివ్రేళ్ళతో పెకిలించ బడేదాకా పోరాటం చేయమని ఆదేశించడం జరిగింది.

ఇక చివరి ఆయత్‌లలో ప్రవక్త ముహమ్మద్ (స)ను సంబోధించడం జరిగింది. 23 సంవత్సరాల ప్రవక్త ముహమ్మద్ (స) నిరంతర కృషి ఫలితంగా అరబ్బులో సత్యధర్మ (ఇస్లాం ధర్మ) సంస్థాపన జరిగింది. ఇస్లాం ఒక నమ్మక మైన, సైద్ధాంతికమైన, నైతికమైన, జ్ఞానవంతమైన, వ్యక్తిగత సామూహిక, ఆర్థిక రాజకీయపరంగా ఒక పటిష్టమైన వ్యవస్థగా- క్రియాత్మకంగా నెలకొల్పబడింది. అరబ్బు చుట్టు ప్రక్క ప్రదేశాల నుండి జనులు తండోపతండాలుగా వచ్చి ఇస్లాం

ధర్మాన్ని (విధానాన్ని) స్వీకరించడం మొదలైంది. ఈ విధంగా ముహమ్మద్ (స) కు ప్రవక్తగా అప్పగించబడిన పని (ధర్మసంస్థాపన) పూర్తి అయిపోయింది. అప్పుడు దేవుడు తన ప్రవక్త (స)ను ఉద్దేశించి “ఓ ప్రవక్తా! ఈ విజయం నీ విజయంగా భావించి గర్వానికి లోనుకాకు సుమా! పరిశుద్ధుడు, ఎలాంటి లోపంలేనివాడు, మహోన్నతుడైన నీ ప్రభువు కనికరం వల్లనే ఈ ఘన విజయం సాధ్యమైంది. కనుక మహత్తరమైన ఈ కర్తవ్యం నెరవేరినందుకు ఆయనను స్తుతించు, ఆయన పవిత్రతను కొనియాడు, స్తోత్రాలు చెల్లించు. ఇంకా ఇలా ప్రార్థించు, ‘ఓ ప్రభూ! ఈ ఇరవై మూడేళ్ల సేవలో నా వల్ల ఏదైనా పొరపాటు జరిగినట్లయితే నన్ను మన్నించు”, హితోపదేశం చేశాడు.